యనుభూరి పిశాచముచే గృహీతులై ॥ వ॥ అనినవినివసంతుం
డు లోభునింజూచి యిట్లనియె మహామోహా మాత్యశేఖ
రా। తృష్ణాపాణినాయకా। జగద్వంచకుండవగు నీకు ధర్మ
కామరూపపురుషార్థ సాధకంబును। సకలజనమన స్సంతో
షసంధాయకంబును। సర్వసర్వంసహావల్లభ సేవితార్థ శాస్త్ర
సిద్ధంబును। నగుప్రత్యక్షార్థ పురుషార్థ ంబునంగు విఘ్నం
బులు లభింపంజాలవు। ధర్మాధర్మ ంబులవలన దత్తస్వాల
పాలితంబులైన। ధనంబులు ధనకాములు భవన్మాహాత్మ్యంబు
ననంతతంబు వృద్ధిబొందింపుచు। పాత్రప్రదానంబులు పరిహ
రించి నిద్రాహారంబులు కొంచెపరచి తద్ధనంబులకు హాని రా
కుండ సంరక్షణగావింతురు నీ వతి సమర్థుండవని పలికినతను
వారినందరిం గనుంగొని యిట్లనియె। వివేకకవచదుర్భేదపక్ష
నుండగు పురుషుండెవ్విధంబున మనచేత వంచితుండగుననిం
గాముడిట్లనియె వసంతానీవు సెప్పినవాక్యంబులు నిజంబులు
వినుమట్లైనను మనమీపట్ల గాతరత్వంబు వహింపం గూడ
దు సమరసన్నద్ధుండనై నేను ముందర నడిచెదనీవును లోభ
క్రోధప్రముఖులును మధ్యభాగంబున దృష్ణాదేవి నిముకొని
యుభయపార్శ్వంబుల నడవవలయు మోహాకుల విధ్వంసం
బుగావింపంగోరుచున్న వివేకుండు నశియించుననిన నట్లకాకం
పవలయునని యందరున్ సమ్మతించి కొంతదవ్వరిగిన గాముడం
దరిసింజూచి యిట్లనియె

సీ॥ మహుకజ్యానమున్వితాస్మద్ధనుర్వి। ముక్త పుష్ప శరా సా
రములకు లక్ష్య।మిప్పుడు లభింపగాజేసె నీశ్వరుండు। చంచలిత
మూని చూడుడీ సమయమునమృపచ్ఛ అని మఱికొంతదవ్వరిగి

ఈ దుష్టకాముఁడు భేద్యయోగసంజనిత మహాప్రభావ బలసం
యుతుఁడై సకలేంద్రియవర్జంబును నడగించి యీప్రాణవిము
క్తత నొప్పుచు వాయుధారణంబొసరగ జేయుచుఁ జెలగు
చున్న నివృత్తి పరుం గసుంగొనెన్ ॥వ॥ ఇవ్విధంబున జెలంగు
పురుషుని గాముడు వసంతునకు జూపినం జూచి వసంతుండు
కామునితో నిట్లనియె ॥గీ॥ ప్రబలమాయాబ్ధి మగ్నుడై ప
రగు పురుషు నిందఱాలున నుద్ధరింపందలంచి విమలితాత్ముని
జేసి వివేకుడాత్మ యువతితో నప్రమత్తుడై యుండునఘ ॥క॥
అనిన వసంతుని గ్రోధుడు గనియిట్లనె కాము గెలువగా వశమె
వివేకునకనిలో సాహాయ్యం బొనరింపరె లోభ ముఖ్యులాగ
గామునకుఁ ॥వ॥ చెలగిన నాధి సంపదనశింపగ జేయగ జా
లు మన్మథుండలఘుమహార్తి జాల సహితాఘ సముద్రము
లో ర్జించు కేవలజడబుద్ధి జంతువుల వంచన జేసి హరించుమాం
స సమ్మిళితములైన గాలముల మించు సుఖంబులు వేడ్క జూపు
చుఁ ॥ఉ॥ జ్ఞానము సౌధమై సుగుణసంపదలాభరణంబులై హ
రిధ్యానము భోగమై జపకథల్ రతులై నిగమాంతముల్ మి
థస్థానములై చెలంగను శాంతిమిషం బఱియింపుచుండు స
న్మౌని విలాసశాస్త్రములు మాటికి మాటికి సభ్యులెన్న గన్ ॥
వ॥ అనినం గ్రోధునితోడ నిట్లనె వసంతాఖ్యుండు శౌర్యోక్తి
వార్తసలం ధైర్యసమేతులై సబలవద్వైరుల్ మృతుల్ గారు కో
రిన చందంబున గావు కార్యములు దారిద్ర్యంబు కల్యాణక
ల్పనలందీగదు దానికిందగిన వ్యాపారంబు సేయన్ వలెన్ ॥క॥
అనిన వసంతుని లోభుడు గనియిట్లనె తృష్ణ రణముఖంబున
వైరి పంధిని గెలువగ శక్యముగాదని భయపడుగాని భీతి యణ

పొగడఁ దగవె యుర్వి। క॥ అనిలోభుఁడు తృష్ణంగను। గొనియిట్లనె నే
ను మరుఁడు క్రోధుఁడు నీచు। ట్టనువసియింపఁగ మదిలో। వనితా
సాధ్వసము బూనవచ్చు। నె చెప్పుమా॥ గీ॥ అవర దానవదుర్జ
యులైన మీరలిందరును జెంతవసియింప నెంతమాత్ర। మైన
మదిలోన భయము నేఁబూనననఘ। యనినగాముఁడు భీతికిట్లని
వచించె॥ సీ॥ పాపిక్రోధోద్యోగమునకిది సమయమనుచు। వచ్చి
శివిగా నిలిచెరి- దర్పాంశౌర్యాన్విహితుఁడై యప్రమత్తత సం
చరించు। సంగరమువాని వెనుకకు జరగవలయు॥ వచ్చు అల
ఘుమనీషయుర్వి సహజమైన బలంబును ధైర్యశక్తిని శ్చలత
తితిక్షయుంగలిగి సత్యదయా కవచాభిరాముఁడై। మలినత
లేని సత్త్వగుణ మంత్రరథంబుపయిన్ వసించి చంచలగతి నొం
దజేయు మనసైన్యము నెల్లవివేకుశిత్తరిన్॥ వ॥ అనివ వసం
తుఁడు కామక్రోధులం జూచి యిట్లనియె। మ॥ అనిమిషాధువృ
రిలోననొక్కఁడు తనుత్యాగంబు గావించిన। న్వాని మోహుం
డునశించుననవిభునితోఁ వేవేగ జచ్చుర్ దదం। గనయుంగాననసై
నికుండనయి శ్రీమంబీయొడంగాసి మో। హునకుం బ్రీతిగ
బోవరే మొదలనుద్యోగింతురే యుద్ధముల్॥ క॥ అనినగా
ముఁడిట్టులనియె యరాజకం। బైనయుద్ధమేరికైనదగదు। నిర్వ
హించుకొనును నిఖిల కార్యంబులా। మోహుఁడనిన గుప్త
మూర్తియగుచు॥ గీ॥ క్రోధుఁడిట్లనె మోహుఁడా నాథకార్య। ము
ద్ధరించుటమేలిదియ శౌర్యోక్తులెల్ల। బలికి సమరభయంబున భ
యముబూని। మరలవచ్చునె వసుధ గాతరులరీతి॥ వ॥ అనిన లో
భుఁడిట్లనియె॥ క॥ మించిన కార్యము నకుశో। కించుట తగ దెట్టి
వానికిన్ సేతువు గ। ట్టించునె గతజలములకుస। మంచితగతి నొ

ప్యాబుద్ధిమంతుండవనిరి॥ గీ॥ బలియుడు వివేకుడతనితో బవర
మునకు । సమయమిదిగాదు దేహరక్షణము జేసి।కొనగ వల
యును బ్రాణముల్ తనువునందు । నిలిచినను శోభనము లచే
నలరవచ్చు॥ క॥ ఆమాటలు విని యిట్లనె । గాముడు లోభు
ని ఏచఃపరికారములెల్లన్ । బేమన్ వినవలెనీతడు। ధీమంతులలో
న మిగులధీమంతుడగున్ ॥ఉ॥ ప్రేమను సాహిత్యకంబు నడిపింపు
మటంచును నన్ను మోహుబుడీ। నీమకుబంపెగాని యనిసేయు
మటంచును జెప్పలేదు సం। గ్రామ మమంగళప్రదము గావున
మానుట మేలు దంభుడు। ద్దామత వచ్చునిచ్చటికి దర్పునితో
గృహనాసమేతుడై॥ గీ॥ భువివివేకా విహీనుడైన పురుషవరుని।
చెంత కేగినమీాదట జేటువచ్చు। జనులు నిందించెదరు మో
హుడను మతింప। డింతయేలయటంచు నిష్క్రాంతులైరి॥ మ॥
పలభుగ్వైర భయంకరాయుధ కళాపారీణ నాగాంతకో। జ్వల
కంఖాణ శరీర కాంతిజితభాస్వచ్చక్రపాషాణభూ। వలయత్రా
ణ ఘరీణ దివ్యవిశిఖవ్రాత స్ఫురత్తూణ ని। ర్మలసౌందర్య ల
తాంతబాణ వ్యాళినక్రప్రాణ నారాయణా ॥క॥ లుంఠితకైట
భ దానవ। కంఠగదా శంఖ చక్ర కార్ముకధరునై। కంఠ జనా
ర్దన కౌస్తుభ। కంఠాలంకార జలధికన్యాధీశా ॥మాలిని॥ సుర
చిరనుతిపాత్రా సుందరీస్తుత్య గాత్రా। సరసిజనిభనేత్రా స
త్యభామాకళత్రా। గిరిశనుతచరిత్రా। కింకరోద్యాన చైత్రా
పరమగుణపవిత్రా పాపవల్లీలవిత్రా॥

ఇది శ్రీవేణుగోపాల కరుణాకటాక్ష వీక్షణ పరిలబ్ధ సకల
సామ్రాజ్య విరాజమాన రావువంశ కలశ పారావార పరి
పూర్ణచంద్రసమాన నిఖిలశాస్త్రవాసనాసముదిత విజ్ఞాన

శ్రీః మన్మహా రాజ రాజశ్రీ వేంకటరంగా రాయ ని [illegible] రాయరాహుద్వేశ్యా భుజంగ సర్వజ్ఞాది మహా బిరుదాభేయ సమర విదళితామిత్ర రాజాధిరాజ మహారాజ రాజ తేజోనిధి మహారాజశ్రీ రాయడప్పరంగారాయనామ ధేయ ప్రణీతంబైన సంకల్పసూర్యోదయంబను వేదాంతనాటకంబునందు గామాది వ్యూహ భేదనమను జతుర్థాశ్వాసము౪ శ్రీ రామచంద్రార్పణమస్తు. శ్రీ శ్రీ శ్రీ

సమాప్తము.

N 

# సంకల్ప సూర్యోదయము.

## పంచమాశ్వాసము.

శ్రీమత్పాకశాసనవారిరీ ముఖనాలీక చంచరీకనుపర్వాస్త్రో
మస్తుతభీషణ సంగ్రామ పినిర్జితమహాసురపరానీకా॥క॥ అత
రువాతను గుహానాస్వీతుండై దంభుడతిపవిత్రుని గతిసంప్రీతి జ
నుదెంచి కుహానా శాతోదరితోడ నింపెసగ నిట్లనియె॥గీ॥
గౌతమునకు నహల్యవై ఖరి బృహస్పతికిని దారవిధంబున దే
విసీవు। హాయ వెప్పుడు నన్ను నిర్బంధపెట్టి। ననునిరీక్షింప వన్య
మానవుల నెప్పుడు॥సీ॥ యనినను గుహానయిట్లనియె దంభునితో
డ నరవరామాత్య తస్కరదురాత్మ। పాషండకితవ శైలూష
కర్ణేజపగ్రామణి ప్రముఖమర్త్యవ్రజంబు। సతతంబు నన్ననుస
రణంబు జేసిన జేతురుగాక నాచిత్తమునను। సంస్మరించెదను
నాస్వామిగానిన్ను నీవేమిచింతించితివో మహాత్మ। సాధ్విసై
నయరుంధతి పాటిదేక। గౌతమ త్రిదశాచార్య కంజముఖుల
వంటిదానవటంచు నీవంటివిభుడు। సిగ్గుపడియెద నట్లువచించు
టకును॥గీ॥ అనిన సతితోడ దంభుడిట్లనుచుబలికె। నీవుపలికిన
పలుకులు నిక్కవములు। సకలలోక పతివ్రతవకటనీవు। నిన్ను
నుతిసేయ బ్రహ్మజునికిని వశమె॥సీ॥ అగ్నులారినను మదగ్ని
హోత్రమునకు లోపంబుగాకుండ లోలనయన। యాయా
తనములో నన్నాగ్నులిడుదువు ప్రకటితపుష్పవై ప్రతిది
నంబు। సద్ధర్మపూర్ణిమాసములకు ముఖ్యకాలాతిక్రమణ దో

షమంటకుండ। జేతువు నెలనెల జెడకుండగా పిండ బిత్రుయజ్ఞ
మునను దృప్తినివహింతు। వనినదంభునితోడ నిట్లనియెగువా
న। కడిమి గలదేవతల యనుగ్రహము వలన। ననలవారదు
పుష్ప దర్శనము గాదు। సత్క్రియల్ సేయబూనిన సమయ
ముగాను॥సీ॥ అనిన దంభుడు తదంగనతోడ నిట్లనె బరమపతి
వ్రతవరయసీవు। మదనపాయినివి సన్న్యాస్యచరిత్రవు ధర్మపత్ని
వి వేదకర్మనిరత। వుత్తమకులజ వత్యుత్తమాచారవు భాగ్య
వశంబున బత్నివైతి। వశనోదకంబుల కాయాసపడునన్నువా
రివాసరంబని యన్నమిడక। గతదినమున నోరుగట్టితివిప్పుడు
ద్వాదశీవ్రతంబు మోనమునను। జరగనిమ్ము నీకుజలజాస్య
యొక్కరకుహాస్యమేర్పరింతు నదియువినుము॥సీ॥ కలిభూమి క
లరీతి కఠినులై వర్జితాఖిల ధర్ములై మాయలలర జేసి। సన్న్యా
సులను నిశాచరులగూరిమితో ధనంజయరావణాన్యాయమున
ను। హరియించెదరునిన్ను దరుణి నన్నడబాసియుండకుమీ
బ్రాహ్మణోత్తమాగ్ర। గణ్యుండ నేను మత్తై-ంకర్యమునకు
నీకంటెనన్యులు కలకంఠితగరు। స్వర్గభూభోగ ఘుటనాప్రచా
ర నిరతు। డగుమహామోహునకు వైరియైన యావివేకునిన
శింపజేయు వేవేగయనుచు। బంపె దుర్మతిసన్నిప్రపంచమున
కు॥గీ॥ ఆతతాయియైన యావివేకునిజంపు। మనుచు మో
హపత్నియానతిచ్చె। యుర్విని శ్యనిప్పు హుడను నేనెన్నైన దేవి
యాజ్ఞవలన దిరుగవలయు॥గీ॥ ఆతతాయుల వధియింప
నట్టిశక్తి। మంతులనురౌరవంబుల నంతకుండు॥ద్రోచుననివ
చియించు శ్రుతికుల్లతాంగి। తద్వివేకుని వధసేయ దగును సు

మ్మ ॥ వ ॥ కావున నేనొక్క మహాదేవతను । భక్తినాథాధిం
పనిర్ణయించి తదీయ దీక్షారంభంబు గావించితి । దివ్యగంగా
జలప్లుతంబులు । లోకపాలపురోహితనీతంబులునగు పారిజాత
పుష్ప ఫలంబులు శీఘ్రింబుగా దెమ్మనిన గుహాన దంభునితో
నిట్లనియె । మోహాక్షేత్ర భార్యాహరణంబు సేయందలంచు
ట । వివేకుండాతతాయియయ్యె । నతని వధియించిన బాపంబు
లేదని నిశ్చయించి । నీవీయభిచార కర్మంబారంభించితివి । య
వ్వివేకుండు సకలాగమావిరోధుండును । శమదమప్రముఖా
మాత్య గణాభిరక్షితుండు నట్లగుట నీవొనర్పంబూనిన యభి
చార కర్మంబువలన నతనికుపద్రవంబు రానేరదు సమర్థుని
సంహరింప నభిచారంబొనర్చిన దదభిచారోపద్రవంబు కర్తకా
నం జెందునని యాగజ్ఞులువచింతురనిన దంభుండు కుహాన
తో నిట్లనియె । మదీయ విభవంబు విచారింపక నీవివ్విధంబు
న బలుకందగదు వినుమనియిట్లనియె ॥ క ॥ పదునెనిమిది విద్య
లు నరు । వదినాల్గు కళల్ గ్రహించి బహుయజ్ఞము లింపొ
దవగ జేసితినిలిపితి । తుదిగా ధర్మధ్వజములు ముల్లోకము
లకు ॥ వ ॥ అనిన గుహాన యిట్లనియె । పదునెనిమిది విద్య
లరువదినాల్గు కళలు నేనెఱుంగుదునని పలికితివి । తత్ప్రభేదవర
ణంబు లేపఱింపుమనిన దంభుండిట్లనియె । శిక్షయును । వ్యా
కరణంబును । ఛందంబును । నిరుక్తంబును । జ్యోతిషంబును ।
కల్పంబును । ననువేదాంగంబు లారును । ఋగ్యజుస్సామాథ
ర్వణంబులను వేదంబులు నాల్గును । మీమాంసంబును । న్యా
యంబును । పురాణంబును । ధర్మశాస్త్రంబును । నను విద్య
లు నాల్గును । చతుర్దశ విద్యలనంబరగునే తచ్చతుర్దశవి

ద్యలు వినుమాయుర్వేద ధనుర్వేద గాంధర్వాదిశాస్త్రం బులంగలసి యష్టాదశ సంఖ్యంబరగె। నింక చతుష్షష్టికళల నెరింగించెద। నాకర్ణింపుము। కావ్య నాటకాలంకార ప్రకారంబును। నీతి హాసాగమంబును। గానంబును। కవిత్వంబును। కామశాస్త్రంబును। ద్యూతంబును। దేశభాగాది విజ్ఞానంబును। లిపికర్మంబును। వాచకంబును। సకలావధానంబులును సర్పశాస్త్రంబును। శాకునంబును। సాముద్రికంబును। రత్నశాస్త్రంబును। రథశాస్త్రంబును। నశ్వశాస్త్రంబును। మల్లశాస్త్రంబును వచనకర్మంబును। వృక్షలతా దోహదంబును। గంధవాదంబును। ధాతువాదంబును। ఖనివాదంబును। రసవాదంబును। జలవాదంబును। వహ్నిస్తంభంబును। జలస్తంభంబును। వాతస్తంభంబును। జయస్తంభంబును। వశ్యంబును। నాకర్షణంబును। మోహనంబును। విద్వేషణంబును। నుచ్చాటనంబును। మారణంబును। గాలవంచనంబును। జలప్లవచాతుర్యంబును। పాదుకానిధియును। వాక్సిద్ధియును। ఘుటికాసిద్ధియును। నింద్రజాలంబును। నంజనంబును। బరదృష్టివంచనంబును। స్వరవంచనంబును। మణిసిద్ధియు। మంత్రసిద్ధియు। నౌషధసిద్ధియు। జోరకర్మంబును। చిత్రకర్మంబును। లోహకర్మంబును। శిలాకర్మంబును। మృత్కర్మంబును। దారుకర్మంబును। వేణుకర్మంబును। చర్మకర్మంబును। వస్త్రకర్మంబును। నదృశ్యకరణియును। దృశ్యకరణియును మృగయాకర్మంబును। వాణిజ్యంబును। బాశుపాల్యంబును। గృషియును। మద్యకర్మంబును। లావకుక్కుటమేషాదియుద్ధకారణకౌశలంబును। వినుమరువది నాల్గువిద్యలనంబరగు। నేను సకల విద్యా

ధురంధరుండ నింకొక్క రహస్యంబు దెల్పెదవినుము। చతుర్దశభువనంబుల నస్మత్పూజ్యమానుండగు నిష్ప్రపంచుండు లేడు। తత్ప్రకారంబాకర్ణింపుము ॥ చ ॥ సకలన్నపాలురం గనిమిసాగరవేష్టితమైన ధాత్రిపై। దుర్భృగురాముడిచ్చిన గరోరత బూనిపరిత్యజించితిం। బరికటగతిన్ సురోత్తములు స్వర్గముమర్త్యమహావాస కాంక్షులై। యకుటిలవృత్తి నిచ్చిన మహాస్త్రముల మెచ్చబరిత్యజించితిన్ ॥గీ॥ రహివివేకాభిచారకర్మంబునీవు। జేయ బూనితివది మహాశ్యేన విధమె। తదిరవిధానమా తెల్పుదగదె యనిన। దంభుడిట్లని సుహాసితో దప్పమునమా ॥ భువినిమహాశ్రోత్రియుడ। త్ని విమచ్ఛిష్యులకు నేను దెలుపనుమీ పల్లవపాణి యీరహస్యము సవినయ గతి వినుముచెప్ప జన దితరులకున్ ॥క॥ నేనే కర్మము జేసిన। శ్యేనాదుల దందమునను క్షితి లోపలవ। ద్యానన యభిచారగతిన్। జూనుననిశ సుహాసతనవి భునకిట్లనియెన్.

క॥ ఈపరపీడన కర్మం। బేపునిమును మూలమున గ్రహించితివనినన్।గోపంబునదంభుడు త।దూర్పివదింజూచి దానితో నిట్లనియెన్ ॥శా॥ నేసర్వజ్ఞుడ కోట పండితులు సందేహంబులెల్లన్ మదావాసంబున వసించి నన్నడిగి మద్వాక్యంబులం దృప్తులై। దాసత్వంబు వహింతు రిప్పుడు జగద్రాధ్యా యండై సముల్లాసస్ఫూర్తిని జరించు గర్వని నుపాలంభింపమోహాష్ఠ నే ॥గీ॥ మోహ దేశికుండు మునితిరస్కరణ తత్పరుడు గర్వి డను దలచనట్టి। కలుషితాభిచార కర్మంబునకు సాక్షి। మాత్రుడగుచు నుండు మందయాన ॥క॥ అల వచ్చిన నేన జ్ఞాతా న యీమహాభిచారక్రియను। బ్రీతిం జేయగదలచిమ

వాశాపసమృత్తి గతిని నధివసియింతున్ ॥క॥ కుడికన్ను బె దరుచున్నది। కుడిభుజము చలింప దొడగె గోమలి వినుమి ప్పుడు మిత్రపరశీనం బలు!వడు ననుచు పచించె నయ్యవసరము నందున్ ॥సీ॥ వితతప్రభా కంచు కితదుర్నిరీక్ష్య శరీరుడై పా దుకాధారియగుచు। సమ్యక్ప్రకంపితాంచ ద్బ్రహ్మదండుడై పాదకంపిత మహీభాగుడగుచు। దండావలం బితోద్య త్ప్రతిజ్ఞా ప్రతిగ్రాన ంచలితమని గ్రాముడగుచు। దపూఢ దేశేం చి తత్సభవారు వినగని। గ్లనిమె పండితులైన జనులనెల్ల। గడిమితో మోహమునకు బ్రీతిగా దిరస్క రించుట కులోకము ల సంచరిచు చుండి। బ్రహ్మముఖ్య సురాళితో పథుడనగు చు। వచ్చితిని నేను భారతవర్షమునకూ ॥చ॥ నవమవసుం ధనాగ్రవ ధనంజయుడు దశమాంబు జాతసంభవుడ ద్రో ణశాంబురుహా బాంధవుడ న్ననుగెల్వ బూని మానవులు చ రింతురీ జడులు నాభటులుండినచో వసింపలే।రవని గణింపగా జగము లన్నియుమూఢశ దిగ్భ్రమరుంజుమీ ॥సీ॥ తొలగించితి నిశాబ్దికులను శిక్షావేత్తలను గెల్చితిని ఛాందసులను బా ర। దో లితి శాంబరీ స్తోమంబులను జయించితి నిరుక్తపరుల జిన్న బుచ్చితిని జ్యోతిషజ్ఞుల సరలించితిని సుకర్మ బ్రహ్మదేవమీ మాంస పరుల। బరిభవించితి న్యాయపరుల హాసించితి ధిక్క రించితిని మాంత్రికుల నెల్ల ।ననుచు జెవిమీంది కత్తి యారౌర నీకు। శిక్షకుండెవ్వ డెట్టభ్య సించితీవి మస్మ విద్యలటంచు నం బరపువలన। జనితమగునట్టి వాక్యంబు వినిమ సంది ॥శా॥ నీ: క్షీరవిభాగమెవ్వడలలో నేర్పెజ రహంస హంసకును। బారా వారజలంబు గ్రోలెదు మహాప్రాజ్ఞత్వ మెవ్వాడు నేన్నారం

నేర్పనగస్త్యసంయమికి దైవానుగ్రహస్ఫూర్తిచె। రారాదా
నిఖిలాగమంబు లితరారంభంబు లేకుండగన్యుగ్ర ప్రబలగతి
నొప్ప సకల శాస్త్రంబులందు। నతిసమర్థుండితండని యఖిల
జనులు। నన్ను సన్నుతిగావింతు రన్నిదెసల। దద్విధంబున శే
మి వాస్తవమువినుము॥మ॥ ధర మర్త్యాంశజులందరుందగినయ
ధ్వర్యుండు లేకుంట। నధ్వరముల్ మాని చరింతురింద్రియ ని
రోధశక్యులైనై సర్వాసం।చరితంబై ప్రబల ప్రభావయుతమైస్వ
చ్ఛందమై దృష్ట్యగో।చరమై యొప్పును మత్తపోమహిమ మా
హాత్మ్యంబు రాదేరికిన్ ॥మ॥ అనుసూ ముందర సంచరిం
చు నిజశిష్య శ్రేణులం జూచి వీరిని విద్వాంసులు నింద శేయు
దురు పేర్మిన్ లోకులన్వీరు మోహాన వాత్యాతురిబం గులం
బధిరులన్వైరస్ధాత్ముల దుస్స్వవర్ణనులం జేతురు వీరికంటెను
సమర్థులెవ్వం బు లేదేరికిన్॥మ॥ ప్రతిపక్షంబుల నన్నిటిం బరిహ
రింపన్ లేని శాస్త్రంబులే।గతి సాధించును నన్నునేనిప్డు వే
టన్ మంత్రమణ్యౌషధో।త్థతులన్ మాయల సప్రపంచము స
మస్తంబు స్మదీయంబుగా। నతిచాతుర్యము మీర జేసెదను మో
హాత్మాధవుండెన్నగన్యుచ్చు మహిని ప్రతిష్ఠితంబగు ప్రమా
ణము భాసిలుచుండ శాంబరి। సహితముతైన వాక్యములుస
ద్వ్యాజనల్ మదినమ్మరంచు నే। తహతహ బూనమింటి యసిలే
త్వాము జూచినవారమూర్త మిహిహాగ। పథంబటంచు బృథి
విన్ శ్రుతివెప్పన నమ్మరెప్పుడున్యుచ్చు మునికధితంబులై శ్రుతిస
మూహా సమేతములై ధరిత్రిలో దనరు షడాగమంబులు వ
దంపఃకీ పూసినయొక కంత్యమె। వ్వనికి ప్రియంబు నేను జెలు
వంబుగ జెప్పెదు భేదశాస్త్రముల్। మననము సేయుచున్ ది

ఘగు మానవకోటులలో గణింపఁగఁ ॥వ॥ అనుచునపసవ్యం
బుగా మొగంబుఁద్రిప్పి మగధ కళింగాంధ్ర ద్రవిడ కర్ణాట
కేరళ కొంకణాదులగు జనపదంబులివి యేతద్దేశంబుల నుం
డు జనులకుహితంబుగా దత్సన్నిచభాషా పరంపరల నలుబదె
నిమిది బౌద్ధశాస్త్రంబులు నిర్మించి వైదికాచార సంపన్నుల
కు దుఃఖోదయంబు గావించినది మొదలుకొని తచ్ఛాస్త్ర
నాపదంబులు వహించి విపక్షుల ననాయాసంబున జయింపు
చు మదీయ శిష్యులు సప్తద్వీపంబులయందు జయస్తంభంబు
లు ప్రతిష్ఠించుచు ననర్గళప్రకారంబున సంచరింపుదురని మ
రియు నిట్లనియె॥ శా॥ ద్వైతాద్వైత సమాఖ్యలంబరగు సి
ద్ధాంతంబు లుం దత్సము ద్భ్రాంతాద్వైతము ప్రకల్పితము
లై భూమండలిఁ భాసిలం బ్రీతింగొందరు తత్కథాసిధరుల్తై
పోట్లాడుచుండంగ మాచ్ఛేతోవృత్తి వసించుమల్లి సమరోత్సా
కంబునం జెప్పెదఁ ॥మ॥ అనుచున్వేరొక వంకఁ జూచియత డా
ప్లావంబుతో నిట్లనె॥ స్వీనుమీ దేశము లెల్ల మ్లేచ్ఛ యవనా
క్రాంతంబులై యుండ నయ్యన వేరొక్క ద్విజుండు వాదపణము
న్యక్ప్రీతితో జేసి మోదినరితిం జ్యూతనష్టులై యపనవాటిం ద్రి
మ్మనుష్యత్వముఁ ॥క॥ ఆమనుజుఁడె యప్పాప్పుర్ద్ధామర గురు
ముఖ్య కల్పితాగమముల చే। వ్యామోహపెట్టు శిశువుల। మా
మక మాయాసమగ్ర మహిమాన్వితుఁడై ॥క॥ పీరుపశుపక్షి
మృగముల। తీరున ద్రిమ్మరుచు రస్మదీయ కృపాసం। పూరిత దృ
ష్టికి బాత్రులు। గారని వేరొక్క దెసను గనియిట్లనియెఁ ॥శా॥
ఈ దేశస్థులు కడుపుస్తకధరుల్ హీనాకృతుల్ వీతవిద్యా
దాక్ష్యుల్ ధృతకూర్చు లల్పమతు లన్యాయోపాస్త లాచార్య

వేవాదూరుల్ బహుజన్మకుల్ విరహిత స్వర్గాపవర్గుల్ చలం
త్పాదాగ్రుల్ జపమాలికాధరులు మంత్రావరామాత్యు
లుగ ॥ఉ॥ అనుచుఁ జేరి వంకజూచు నెడ గోత్రాదిత్యు
ఁడొక్కండు సయ్యెన నేతెంచినవానిఁజూచి యితఁడుద్యత్ప్రీతి
తో దక్షిణాపథమున కేతెంచుచు నున్నవాఁడితఁడు చెల్వుగ ము
త్ప్రియాలోక్య పరిగణలంచున్ మిగుల మెచ్చి తద్ద్విజునితో దా
పిల్ల నెగ్గు వేమనగ ॥ వ ॥ నీవుత్తర దేశంబుననుండి వచ్చెదవ
వి తోఁచుచున్నది। మోహపత్నియగు దుర్మతినమా దేశం
బున హిమవత్పర్వతంబునం దస్మద్భార్యలైన యీర్ష్యాసూ
యలిరువురు సంచరించుచునుండురు। వారల వృత్తాంతంబు నీ
వెఱుంగుదువేయనిన నవ్విప్రుండిట్లనియె వివేకపత్నియగు సు
మతికి నెచ్చెలులగు మైత్రీముదితా కరుణోపేక్షలు భవ
త్పత్నులైన యీర్ష్యాసూయల నివృత్తియను గారాగృ
హంబున నిర్బంధించిరనిన దర్పుండు తద్విప్రునిం గోపంబునం
జూచి దుర్భాషణం బాడింపుచు నిట్లనియె
॥ఉ॥ అన్నృతచరిత్రభాసుర కళాధను మద్వనితల్ పతివ్రతా
వినుతలు వారికిట్టి యపవిత్ర మనోవ్యథ లెట్లు సంభవించును
వనభూములందిరుగుచున్న కిరాతుల సేవ సేయుచుఁ। దినము
ఁబువ్వు నీకుజగతిన్ సుచరిత్రిత సంభవించునే ॥ క ॥ ఊత
వి గ్రిందటనేను గిరాత గ్రామములలో దురక పల్లెలలో బాల
తవృత్తి వహింపుచు। గాతరతందిరుగుచుండ గనుగొంటిజమి
॥గీ॥ తుమురాచారు డిచ్చోటికేలవచ్చె మామకీనల కుశ
లంబు ప్రేమతోడ। నేలయడిగితి నిది దేశకాలమహిమ। నే
తలఁచియుండ దీనికి నంతయేల ॥ సీ ॥ ఇలపైని తల్లి దండ్రులు

పాశుపతరతుల్ బౌద్ధులు వీని సంబంధులె వెల్ల। వసుధ దిగంబర
శ్రితనిరతులు వీని శ్వశురాశ్వశురులు నిస్సంశయముగ। సాం
ఖ్యయోగోత్సవ సహిత వీని వధూటి వైశేషికుడు వీని దేశి
కుండు। వివిధ చార్వాకులు వీని మిత్రులు వీని యాఖ్య మధ్యా
చారుడన్నృత వాడి। వీనితోడను మావంటి మాన్యపాత్రము
లకు భాషింప దగదు భ్రష్టులని వీనితోడ భాషించినట్టి దు
ర్దోష మెల్ల। భానుసందర్శనము జేసి పాపుకొందు॥
మ॥ అనుచున్ మోహము కవచెప్పి రవికన్యా జాహ్నవీ
మధ్య సీమను కాసిల్లు పురంబులోని గని పేర్మిన్ శంకరాం
భోరుహాసన దత్తోరు వరప్రభావుడయి యాసక్తి న్వివేకంబు
నున్నెనుదానిచ్చటికా తనిం గెలుతుమంచు బల్కి రాజేరికిన్
మ॥ అవనగన్ పృథివీపతుల్ నైజ పరసుమోహాస్త్రము యాజ్ఞంగ
శాత్రవులై మ్లేచ్ఛముఖుల్ వసి చెడను వృత్యగ్నులకు ములం
ముం ధనాఢ్య దేశంబులయందు వానినయుమువే వాక్పతుల్
బూని స్వేరుపుతో దాంభికులుం దురాత్ములును బాహుళ్యంబు
లేనట్లుగన్॥ఉ॥ యాచనసేయరన్యుల సయాచితలబ్ధ ధనం
బు ధాత్రిలో। లోచన మెత్తి చూడరతిలుబ్ధత నెంతటివారు
వేడినం। గాచ మొసంగరాగ మశిఖాపరణిశ్ నటియింతురో
మాత్రీచుని వంటి వాని బెదిరింతురు మాయలచేత దాంభికుల్॥
క॥ కలిపురుషుని భాగ్యగౌరవంబో మహా మోహపూర్వ సు
కృత ముఖ్యఫలమో। పుణ్యభూములందు బుట్టిన యీ దాంభి
క ప్రకల్పిత ప్రకార మహిమ్ములౌ॥ వారస్త్రీ రతికేళులందు
మదిరాస్వాదంబు మోదంబు కైన్కారం జేయుచు వారితోడ
మరవాసంబందు నిద్రింపుచు॥ గూర్చిరతంబున రాత్రిబుచ్చు

చు బగల్ బ్రుత్యుక్త వేషంబు లింపారంబూని హరింతురజ్ఞు
ల సమస్తార్థంబు లీదాంభికుల్॥గీ॥ యవనదేశ ప్రసక్తి బా
యంగలేక। తమతమ కులాశ్రమాచార తతిక్రృశింప। నన్యగ
తిలేక తిరుగుగోత్రామరులకు। నెలవులీ యగ్రహారముల్ నిర్ణ
యంబు॥మ॥ శ్రుతిసంస్కారము లుత్సవైక తనువుల్ శోధిం
పగా సంధ్యావర్జిత కాలావశివాద జర్ఘరిత మూర్తి స్ఫూర్తి
గాయత్రీకుంచిత మత్యంత శుచిత్వమీ ద్విజుల కుత్సేకంబు
తో మోహాభూపతి యాజ్ఞంగలివేళ సాంఖ్యమతముల్ భా
సిల్లెనుదవ్యగతిగా॥మ॥ తరుణాకారులు కృష్ణవర్ణకచులే తర్ణం
పతుల్ వీరు బంధురవృత్తిగా భువినగ్నిహోత్రములు నిర్దో
షంబుగా జేయనేర్తురె కందర్పుడు సవ్యసాచి సమరోద్యోగం
బువాటించి యుర్వ్వర శాతాశుగ వృష్టిముంచి మతినారోపిం
చు జాంచల్యముగా॥క॥ అపరిక్షితులగుశిష్యుల। కపరిమితో
త్సవములతోడ నాగమములు నేర్పుపుమీరం బ్రతివీథుల॥నుప
దేశించెదరు ధనసముత్సుకులగుచుగా॥గీ॥ అనుచువేరొక చెస
నుగన్గొనుచువీరు। చిత్రలిఖితముముక్షుల చెన్నుబూని। వేది
కాసీనులై మునివృత్తితోడ। బరులచేతను భూషింపబడుదు
రెప్పుడు॥ ఈ వసుధా సురాధముల హీనకుశాఖ రణాం
గుళాన్వితం। బై విలసిల్లు దక్షిణాశయంబున ముక్కులు మూసి
తారకల్। తావులుదప్పనట్లుగ బటంపడి చేయుచు దక్షిణాంబు
సం। జావదలంచు మానవుల చందము బూనెద రబ్రమత్యో
డుగా॥గీ॥ పూనిరి భజింపనేరక మానవృత్తి। రక్షకులులేమి
బూనిరి మోక్షసరణి। నర్థహీనత భిక్షుకులైరిగాని। విమలము
లు గావు వీరిచిత్తములు నిజము॥మ॥ అనుచుంగ్రమ్మర దర్శ

డిట్లనియె వీరక్షీణమానాన్వితుల్। మానిశేషుల్ మదసంయుతుల్ నిగమనిర్ముక్తుల్ దురాచార వాసనులత్యున్నత డంభవృత్తులు తిరస్కారప్రియుల్ వీరలౌ। గనరాదంచు మొగంబుద్రిప్పి యొకవంకకు జూడగానచ్చుటలౌ ౪వ॥ కొందరుజాపకులు వసింప వారినింగనుంగొని దర్పండిట్లనియె॥సీ॥ మృదులతరాముష్టిమేయ యజ్ఞోపవీతచ్ఛన్న వక్షోవితర్దులగుచు। మంత్రివర్ణన్యాస తంత్రసంస్పర్శిత వదనప్రముఖ నిజావయవులగుచు। బహుజనసంచార పద్ధతికల్పిత చిత్రదర్భాసనా సీనులగుచు। నత్యంతకఠిన హస్తాంగుళి సంభృతరుద్రాక్షమాలికాధారులగుచు। మోక్షమునకిప్పుడే మోదమునను బోవు। వారితెరగు వహించియున్నారుగాని। త్రైర్థికధనంబు దోచుకోదలచియిట్టి। భూమికలు వీరుపూనిరదద్భుతముగాదు ౹చ॥ పటుతరదంభకేతువుల పద్ధతిభాసిలు దర్భముష్టి సంఘటితమైన దండములుగట్టిగ నేలనుబ్రాతి వానిచెంగటను వసించివీరధీరగర్వముననౌ ధనమిచ్చి మ్రొక్కువారి కెక్కటపు మనుష్యులన్ మహిని గన్గొనరాశలు లేనివైఖరిన్ ॥వ॥ ఈ మహాదాంభికులు నయనంబులించుకమూసి మానసంబుల బరమేశ్వరధ్యానంబుసేయువారి చందంబున సమాసీనులై సమీపంబుననున్న దేవతలనైనం గనుంగొనరు। పితృ మాతృ గురుసాక్ష్య లెదుటికేం తెచిపలుకరించినను బ్రత్యుత్తరంబియ్యరు ప్రత్యుత్థాన ప్రణామ ప్రముఖ కర్మంబులు జరిగింపరని వచియింపంబని లేదు। శమదమవృత్తి సమాధులయందును। నిస్పృహాభావంబులయందును నిష్ఠగలిగిన పురుషులు దంభాన్వితులగు మహాత్ములదశకోట్యంశలలో నొక్కయంశంబుననైనం బోలరు। వీర

అలోనివ్వాకమునందు ధూర్తత్వంబు వహించి బకవృత్తింబూని యుక్తసాధ్యంబుగాని తపంబు సేయువారలలో నగ్రగణ్యుం డని మరియు నిట్లనియెయ్యుగీ॥ ఊర్ధ్వబాహుండు తాపసోద్యోగరతుండుకుశలస్థితి యుతపదాంగుష్ఠమాత్రుండచలితాకారుండు దాంభికాగ్రగణ్యుండను పరిత్యాగమొసరించినట్లుదోచు వ॥ అనిమరియొక వంకజూచి యిట్లనియెంచ్చు అనలముననాస మిస్త్రులిడి యజ్ఞులుమెచ్చ మాటిమాటికా యనలునకునా మస్కృతులు దారతజేయుచు గాంచనాద్రి గోరినయధికారియై వడినిమృత్తికమేనున దోపుచుండ నీచనటిజనుండు జన్మములు జేసినదైనది గానవయ్యెడునా॥క॥ అని వేరొక వంకగనుంగాని కలిసన్యాసి జనులకుంబుట్టిన కాంచన నిస్పృహత్వములసేమనుచును వచియింపవచ్చు మదిలో నహాహా॥ఉ॥ భిక్షమొసంగుమంచు దనభృత్యుల కగ్గమొసంగుమంచు కాటికీయమయ్యెనంచును బటిష్ఠముగా నిగమాంతలేఖకీ దక్షిణలిమ్మటంచు ధనదాతల పంచలవెంబడిం ధనాపేక్ష జరింతురీ యతులనీషణులా గణుతింప ధారుణిన్॥ ఉ॥ ఈ యతులీతపస్విజనులీ నియమస్థితులీ వ్రతస్థులన్యాయము గోపనంబుగను నర్పి చరింపుదునుండ శాస్త్రవాజేయుదుగాదె మోహాంధుడు వసించు వివేకుడు వేట్కజన్ము క న్యాయమునా తటంబుల వటంచు వచింతురు కొందరజ్ఞులా॥మ॥ అనఘా చారపయోధిసైకత నిభంబై యొక్కచో మృద్ధ్వజంబును బాపంబులద్రుంచు కత్తులగతిం బొల్పారు దర్భోత్కరంబును వేరొక్క యెడన్ ఫలంబులు సుమంబుల్ తేజిగుళ్ళొప్పెకరా వంకను భాసిల్లెడు వేతదాశ్రమము వేట్కన్ గన్గొనంగా వలెన్॥మ॥ తగని

యాశ్రమ మధ్యసమదు విరుద్ధక్రూర ధీవంశముల్ । త్రిగుణో
ద్యత్స్ఫుట వాగురల్ విషమవృత్తి స్థూల వింధ్యాటవుల్ । వ్యాగ
తృష్ణానదృశ త్రివర్గములు తాల్మిందాటి వర్తించు మహానిగ
రంబీమునులందు ముఖ్యుడగువానిం జూడగానే గెడన్ ॥ వ॥ అ
నితలంచి మరికొంతదవ్వరిగి తదాశ్రమ మధ్యంబున దీపించు
చున్న యొక్క పురుషునిం గనుంగొని యిమ్మహాత్ముండు భా
మసకు దండ్రియో భ్రాతయో తనయుండో కాని మఱియొ
క్కండుగాడని వితర్కింపుచు నాంగికంబులగు శుభనిమిత్తం
బు లాలోచించి యియ్యాశ్రమంబున మదీయ భార్యయగు
ననూయం జూతుననుచు మెల్లమెల్లనె చనుచుండ నంతకం
టెముందుగా దపస్వివేషంబు వహించి యనూయ తదాశ్ర
మంబు ప్రవేశించి యిట్లనియె వివేకాక్రాంతంబులగు చతు
ర్దశభువనంబులు సంచరించుచు బ్రియాగతీర్థంబున నవగాహ
నంబు చేసి పూజ్యుండును కులపతియునగు ధర్మధ్వజుండును
నైన యిమ్మహాపురుషునాశ్రమంబునకు జనుదెంచితి గుణా
వంతులగు వారిచ్చట నుండిరేని వారియందు దోషారోపణం
బు గావించెద నేను ప్రవేశించితినేని విశ్వదోషాపహారి యగు
పరమేశ్వరుండైన నిర్దోషుండై ప్రవర్తింపంజాలడు । మదుప
గృహీతులగు పురుషులు నిరంకుశులై నిర్దోషులయందు
దోషారోపణంబు గావింపనేర్తురు దోషాన్వితులగు జనులయం
దు చెప్పనేలయని మఱియు నిట్లనియెం జ॥ మదుపగృహీతు
లై పరమమానవులుర్వి సముజ్జ్వలద్గుణాస్పదుడగు రాము
నిర్గ వనిత బంపినటంచును బొంచివాలినిన్ । మదమణగించి
పరచు బలుమారు తిరస్కృతి చేతురన్యులం బదపడి సన్నుతిం

చెదరి పల్కుల నెవ్వరినైన మెత్తురే॥సీ॥ సౌపర్వతటినీ సమీప
వనీపాటవీ క్షితికల్పితాసనా సీనులగుచు। బటుతర పర్యంక
బంధబంధుర నిశ్చలోన్నత దేహసంపన్నులగుచు। దీర్ఘజటా
సముద్దీపిత గ్రంథిసంపర్క స్ఫురచ్ఛిరోభాగులగుచు। దపము
గావింతురీతాపసుల్ ముక్తుల వైఖరి వీరలవర్తనంబు। నేనె
రుంగుమ యౌవనాన్విత వధూమణీ న్యస్తనన్యస్త హృదయులై
నిత్యమతను। దేవతోపాసనంబు సుస్థితిని జేతు। రనుదినంబు
ను గంటకితాంగులగుచు॥సీ॥ శ్రద్ధాన్వితులరీతి సంచరింతురు
పిశుకదంష్ట్రిసోపేత భోజననిరతులు। కామనిష్ఠాపరుల్ హేయ
దాసులు లుబ్ధశేఖరుల్ సజ్జనాక్షేపరతులు। మార్జారచరితు
లు వర్జితాచారులు బకసమానులు మహాపాపహృదయు। ల
క్రమ జపతపోవ్యాపారు లన్యాయమార్గ సంచారులుపహాస్య
యుతులు। హాకిశయన యోగ్యమగు దళంబులుగల।మంచి
వటముక్రింద సంచరించు। చునుదదీయ పత్రిజనిత పాత్రిలలో
భుజింప గోరుదురు నిషేధమనక ॥క॥ అనితిరిగిచూచి యచ్చ
ట ఘనులైన యతీశ్వరులను గనుగొని తత్కామిని యిట్ల
నె సన్యాసుల। కనయము పరపీడ సేయుటనుచితముగదా॥
క॥ మీరందరు సుతసోదర। దారాదులపై మదీయ తాత్ప
ర్యమునన్। వైరపడి సన్యసించిన। వారుగదా నిందసేయువచ్చు
నెనన్ననే॥ క॥ అనుచును సన్యాసుల నెల్లను బరిహాసనంబు
చేసి లలితగతింగన్గొనె వేరొక మార్గంబున।జనుదెంచుచున్న
న్న గర్వసంయుతు నొకనిన్ ॥వ॥ అతనింజూచి యంతర్గతం
బున నిట్లనియె॥ సీ॥ దండకమండలు మండితహస్తుండు కాంస్య
కుండలయుక్త కర్ణయుగుడు। దృఢదర్భరజ్జు సందీప్తశరీరు

డు మోదకాశన పూరితోదరుండు। హుంకారచకిత నిశా
పాంతమనుజుండు వచనతృణీకృత వనజభవుండు। సకల దిశా
వ్యాప్తచటుల నేత్రద్వంద్వు డఖిలలోకైక భయంకరుండు।
దేవదానవులకు నైన దేరిచూడ। రానిధర్మధ్వజుని మహాశ్ర
మమునకును। నిశ్చయంబుగ బరుల నిందింపుచునున। ముజ్జ్వల
స్ఫూర్తి నేతెంచుచున్న వాడు।। క॥ వీనికులాశ్రమవృత్తి। స్థా
నంబులు తెలియవలయు దప్పకయనుచున్। వానిసమీపంబున
కుం। దానయరిగి వానితోడ దర్పుండనియెఁ ॥సీ॥ భగవతీబా
లిక భారతసత్కథా భారప్రసిద్ధ వైభవలతాంగి। ప్రవ్రాజకా
శ్రమ ప్రధమదేవత యోగసిద్ధిప్రసిద్ధ విశేషనటన। భవదీయ
కులగోత్ర పట్టణప్రముఖముల్ వీనుల వేడ్కతో వినదలంతు
ననినదర్పునితోడ నయ్యసూయాదేవి యిట్లనెఁ గుపితయై యి
ట్టులడుగ। వమ్మునే యతులకు నీవు వందనంబు। జేయవైతివి నీ
యభిప్రాయమేమి। యనినదర్పుడు దానియాస్యంబు చూచి।
పరహాసింపుచు నిట్లని పలికెనపుడు ॥గీ॥ ఇలవయఃకర్మవిద్యా
ప్రభృతులనేను। మగువ యుత్కృష్టుడను నాశ్రమంబువలన।
నీవు పెద్దవుగాన సందేహబుద్ధి। వందనముజేయనైతి నవంద్యవ
నుచు॥గీ॥ అనిన నయ్యసూయ యతనితోనిట్లనె। నేతదాశ్ర
మమున కీశుడగుచు। దనరుకులవిభుండు ధర్మధ్వజుడు వాని।
చెంత కేగు పెమ్ము శీఘ్రముగను ।క॥ అనినఁ దర్పుడసూయం।గ
నియిట్లనె సంశయింపగానేటికి సీ। యనుమతము వొప్పునను నే
జనుదెంచెద మధ్యవర్తి సన్నిధికబలా ।క॥ నీవాఙ్మాధుర్యము
సీ।భావము నీచూపు నీశుభప్రకృతులు రా।జీవాక్షి చూచి మ
దిలో।భావించితి నిన్ను బూర్వపరిచితవనుచున్ ।వ॥ అనిననసూ

లెను యిట్లనియె నినుం బూర్వకాలంబునం గనుంగొనినకీర్తి
నూహించెద నేతత్ప్రసంగంబింతియె చాలు। మహానుభావుల
గుమ దనరారు పరమహంస పరివ్రాజకులు మత్పదంబులకు
నమస్కరింతురు నీవనఘుఁడవై పాపంబుని తెఱంగక నాచరిం
చితి వింతియెకాదు ధవళవస్త్రంబులు ధరియించితివి। నీకు
బ్రాహ్మణులచేత ప్రాయశ్చిత్తంబు చేయించి నిన్ను బరిశుద్ధు
నిం జేసెదననిన దద్వాక్యంబులు వినినం దేహింపుచు దదాశ్రి
మస్వామి సమీపంబున కయ్యంగన వెనువెంటం జనుదేర
దంభుండయ్యిరువురం జూచి మౌనవ్రతం బవలంబించి కుహన
కంగనుసన్న గావించిన యక్కవాన వారిరువురి చెంతకుం జని
మీరిరువురు దూరమార్గాగతుల దూషితుల కృతస్నాను
లునగుట నీయజమానుని చెంతవసింపందగదు। మీఛాయ
దగిలిన మంత్రసిద్ధి కపాయంబగునట్లగుట దూరంబుగానుండ
వలయు నింతియెకాదిప్పరమ పవిత్రుండు మహామునీంద్రుల
నైనను సమీపంబున నుండనీయండు తత్కరార్పిత గంగా
ంబైనను స్పృశింపండనిన దర్భుండు రోషాక్రాంతుండై యి
ట్లనియె ౪సీ॥ మీధర్మనియమ మగాధంబు పూర్వదంపతుల
కైవడి గానబడుదురబల। గంగార్కపుత్రికా సంగమంబున
బవిత్రములైన వేదమంత్రములు ప్రీతి। బఠియింపుచును శాస్త్ర
పద్ధతిస్నానంబుగావించిసూర్యునిగతిజెలంగుచున్నమావంటి
వ్యుత్పన్నులనీడ మీమీద బారినను శమింపగలరె। మామక
చ్ఛాయదగిలిన మాత్రముననె। నిరయమునమీరు పడుదురు
నిజమటంచు। మందహాసంబుగావించి మరియుదర్పు। డవ్వధూ
మణితోడ నిట్లనుచుబలికె౪సీ॥ సకలసంయమి జనసంభావితుం

తనై కొమరొప్పగా జెలంగుదును నేను। సర్వసంగములు వి
వర్జించి యోగినిష్ఠమై దనరారు నీయంబుజాక్షి। మేమిద్దరము-
సంయమివరోత్తముల మాట వందనంబునకు వివాదపడుదుము। నీత
నిసన్నిధిం జేర్చెంచితిమిగాని రమణి మాకితర కార్యములు లేవు।
మాకవృత్తి వహించి దుర్మార్గుడగుట। దనజడత్వంబు పరుల
చిత్తంబులకును గానరాకుండ జేయును గరిమ నీతడు। వీడును
మావాస యోగ్యుండు గాడు భువిని॥ వ॥ అనుచుం దర్పుడు వ
ల్కి సన్యాసి కృతాంతాకారుడై దంభుడా। తని పై హుంకృతి సే
యగా గుహానతద్ధర్మధ్వజుం జేరి యిట్లనె నీవాజ్ఞ యమవ్రతం
బున కపాయప్రాప్తి రాకుండ వీరిని మన్నింపుమటంచు బల్కి
నను దేర్చి నన్ దర్పునిం జూచుచున్ ॥వ॥ దంభుండిట్లనియె నిర్లే
పకంబుగా బ్రాహ్మణ వేషధరుండవై మూర్ఖజన శిఖామణివై
చరించుచు నీతో సంభాషణంబు సంభవించె నీమాహాత్మ్యంబు నీవె
రుంగక నన్ను మూర్ఖుండని నిందించెదవు। బహువత్సరార్జితం
బగు తపంబు నశించుననుచు నేనుసందేహించి శపియింపక శాం
తించుకతన నీకు స్మృతి సంభవింపదయ్యె బహుజనులు నన్ను
నిందించి భస్మీభూతులగుట నీవెరుంగవని తోచుచున్నయది
మదీయదృష్టిపథంబున నిలువక బ్రతుకనిశ్చయించితి వేని మా
రంబుగా జనుము నీవప్రసిద్ధుండవగుట నిన్నెవ్వరెరుంగరనిన ద
ర్పుండు రోషారుణిత లోచనుండగుచు దంభునితో నిట్లనియె
గీ॥ మూర్ఖచిత్త నీవు మునివేషధారివై। భూమిసురుని రీతి బో
లుచుకతన। వామపాదమునను నీమౌళిబగులంగ। దన్నెదతి
శాంతదశవహించి॥ మ॥ విమతాభిజ్ఞుల గెల్చితిన్ సభలనవ్విద్యా
బలస్ఫూర్తి క్షేత్రము సత్యవ్రత మన్వయాధిపతి సహ్యదక్షా

విభుండుత్తమోత్తము తుండీరము మండలంబుపుర రత్నంబె
న్నగా గాంచికూవ మిళతూర్కర్మమువంటి వాడెరుగునే ప్ర
ఖ్యాత చారిత్రులన్ ॥గీ॥ మామకాచార మెరుగక మండిపడు
చు సన్నాచారమార్గ సంపన్నునిగను దూరమున నుండు
మంటివి దుర్జనప్ర ధాన దాంభిక సద్గుణహీన నీచ॥ గీ॥ అని
యసూయజూచి యాదర్పుడిట్లని పలికెమూవక ప్రభావమిం
చుకైన వీడెరుంగడీ నీచుడెవ్వడో తోచదనుచు దంభుతో
డననియె ॥చ॥ సనకసనందనప్రముఖ సంయములైనను య
జ్ఞదానవర్తనకల ధర్మసత్య సముదగ్ర తపోవిభవంబులం జ
గంబున వినుమచ్చతాంశమునబోలరుచెప్పగనేల యన్యులన్
మునుకొని శ్రోత్రియుండయినప్రముకరు నుత్త్యబ్దము లల్పమైనో
చో॥గీ॥ అస్మదీయధర్మ మజ్ఞుడవై నీవెరుంగకున్న నేమి రూ
థముగను దెలియజేతు వినుము మలినచరిత్ర రోషంబువిడి
చిపెట్టి సంతసమున॥ చ॥ వినుము పతివ్రతామణి వివేకసము
న్వితనై చెలంగుమజ్జనని జారబంధువుల నన్నిఁకేగెనటంచు
దత్కృతాశనము భుజింపనైతి గుణసంపదలన్ వినయంబున
గలంబునను సమస్తవిద్యలనుబోలు నె సన్నవకైనధారుణిన్
మ॥ అనినందంభుడు దర్పుడనింగని కృతాంతాకారు
డై యిట్లనెన్ వినరాదుజన నేనుసద్గుణ గణాన్వితుండ ం
చున్ మదం బుసభాషింతువు లజ్జలేక సుజనుల్ భూషింపగా
నీతపస్వినికిన్ వందనమేల మానితివి పృథ్వీదేవవంశాధమా॥
చ॥ జనకునిరీతినన్ను సురసంఘము లర్చనజేతురీ ధరిత్రిని
గలపెద్దలెల్ల వినుతింతురు వందులవై రిన్ మహామునులకునై
న బూజ్యుడ నముజ్జ్వలవృత్తిని నేను నాకు వందన మొసరివ

వైతివి పదంబుల పైఁబడి భూసురాధమా॥ మ॥ బలభిన్ముఖ్య స
మస్తనిర్జర శిరోభాగస్ఫురద్రత్న నిర్మల శోభాన్విత పాదప
ల్లవ జగత్ప్రఖ్యాతి చారిత్ర కోమలిమద్భార్య పతివ్రతా వినుతదుర్నామంబునందీని యంఘ్రుల్పై నేలశిగంబు మోపవని యాక్రోశంబునం బల్కెనట॥ సీ॥ దర్పించిట్లీశ్రమ దధ్ధర్మ ద్విజునితోడ
బరనిందయాత్మ ప్రభావవినుతి। సతతంబుజేయుచు సద్బ్రా
హ్మణులను బూజింపక మదిని దుఃఖింపజేయు। దువునీవు దు
ర్మార్గుఁడవుగాన రాగలజన్మంబులందు నీచంబులైన। చండాల
శునక మార్జాలాది యోనుల జన్మింపగలవు సంశయము
లేదు। సకలలోకంబులందు నేసంచరించి। చూచితినిగానినీవం
టినీచమతుల। బూజగావించినట్టి విప్రులనుభూమి పతులనెమ్మె
డజూడ దౌర్భాగ్యసహిత॥గీ॥ పశుపతుల జూచితిని నవబ్రహ్మ
లను ముకుందంబులతో జూచితిని వజ్రధరునిజూచి। శివిమ హిమ్వారి
కంటె నీఘనత గాన। బడదు మాకు నమస్కరింపవుదురాత్మ॥
క॥ ధరణీసుర వేషమహా। దురిత కళాధార నిజమ ధూ
కింకర ముష్కరచరిత నీవు నడుదువు। నిరయములో ననిన ని
ల్లనెన్ దంభుడాగిక॥గీ॥ వాచాలుడనై లజ్జ। మోచన మొనరిం
చి శునకము తెరంగున దుష్టాచార మొజ్జబెట్టకు। నీచాలా
పములు నేగణింతునె చెప్పుమా॥ ఉ॥ జాతికిబాహ్యులై సకల
సంయామి ముఖ్యుల నిందసేయుచు। బీతియు లేదయున్ విడి
చి పెద్దలతో గలహింపుచున్ బరిజ్ఞాతలరీతి దేశముల సంచ
రణంబొనరింతురీ ధరి। త్రీతలమందు గొందరువరిష్ఠుడు నీడనితో
చువారికిన్ ॥ వ॥ అనినదగ్పుంచు కరంబు లప్పళించుచు యథా
ర్థంబు వచించిన నీవుకోతి తెరంగున గోపగింపంగూడదనినదం

భుండిట్లనియె మీరిదుర్జన శిఖామణులో కాసరంబు తెఱంగునఁబ్రవ
రుండవైతి వింతియె కాని విశ్వవృత్తాంతంబు నీవెఱుంగవని మ
రియు నిట్లనియె ॥చ॥ గొనకొని సత్యలోకమునకున్మదమొప్ప
గ నొక్కనాఁడు నేఁజనిన సనందనాది మునిసంఘముతోడ వి
రించి నేనసించిన కడకేగుదెంచి నుతిజేసి నిజాలయ సీమకోడ
దొడ్కొనిచని హస్తముంగడుగుకొంచు సమర్పణజేసె నర్ఘ్య
ము ॥వ॥ సరసిజసంభవ సముద్భవులగు సంయములు కొన్ని
కొన్ని ధర్మసందేహంబులు నన్నడిగి మదీయ వాగమృతంబున
నిస్సంశయ మానసులై నాకు నమస్కరించి నిజాశ్రమంబున కే
గుచుండ నినఁ గుహానదర్పవిరాజిత ధర్మధ్వజు వాక్యంబులు న
మృతంబులు గావనిన దర్పుండు మనంబున నేతద్ధర్మధ్వజుండు
దంభుండే వేలంది కుహానయని గ్రహించి దానితో నిట్లనియె నీ
వు కుహానవితండు దంభుండు మీరిరువురు మాకు బంధుభూతులు
మీ చరిత్ర యన్యులకు సంభవింపదు మీరిరువురు విశ్వవృత్తాం
తజ్ఞులగుట మీతో విన్నవించు కార్యంబులు లేవు నీవు పరధన
హరణ ప్రవీణవు భవద్విభుండు పశుహింసామాత్ర చరితా
ర్థాధ్వరుండును వశీకృతాఖిల జనుండును గావున మీయిరు
వురివలన నేశత్రువారికామణికిని నాకుంజరిగిన వివాద దీర
వలెనని దంభుండు మందహాసంబు గావించి యసూయాద
ర్పులతో నిట్లనియె॥

క॥ ధ్వనిమాత్రసాధుఁడవు స। జ్జన దూషణ పరుఁడవాత్మసఖుఁడవు
దర్పుం।డనువాఁడవీవు నీభా।మినియైన యసూయయుఁ దనుమీఁ
నమ్ముము దీర్పు ॥ఉ॥ ఆసమయంబునన్ సభికులందరు దర్పునిదం
భునిన్ సముల్లాసముతో గనుంగొనుచు చెలంగిరి పుష్కరవాణి గా

శ్రీ భూ॥ వానులరీతివీరు చెలువంబగు ధార్మిక వేషముల్ రహిం
దాల్చియు లేక పూనిరని తప్పక దిక్కుల మోసెనయ్యెడన్॥
క॥ ఆ మాటల్ విని దంభుడు। ప్రేమం జెందెను నమస్కరించె
మ దర్పుండా మోదించె ననూయయా। భామిని ముదమందెగు
హానపలుమారు మదిన్॥ క॥ దర్పుండంజలి చేసెను। నేర్పున న
దంభునకు దర్పునింగని దంభుం। డర్పించె నర్ఘ్యమింపు జె
గుర్పుగ భాషించుకొనిరి కుహనానూయల్ ॥ మ ॥ కుహనా
మాయలు దర్పదంభులు వివేకుందద్వధూటిన్మహా।మహాత్ములై
పట్టి తదీయమంత్రుల జయింపంగోరి తత్తత్క్రియల్। తహినా
లోచన సేయుచుండగను దుర్మత్యన్వితుండై దురా॥గ్రహవృ
త్తిం జనుదెంచె మోహుడు సమగ్రస్ఫూర్తి నచ్చోటికిన్
వ॥ ఇవ్విధంబున నేతెంచి మోహుండు దుర్మతింజూచి యి
ట్లనియె మహాసాహసికుండును గులఘ్నుండును నగు వివేకుని
విధ్వంసనంబు సేయంబూని సమాధిన మేతపురుష సంక్షోభ
ణంబుకొరకు నేనుం బంపిన సింహావనగుప్తి న్యాయంబున బ
రన్నరాతి రక్షితులగు కామక్రోధాదులు కాలోపపన్న భ
యకలుషితాత్ములగుచు వాలుకాకల్పిత సేతువుల తెరంగున
భగ్నవ్యూహులై పలాయనం బొనర్పుట మదీయసందర్శ
నంబునకు రావెరచి వలుదెసలకుంజని ప్రాయోపవేశంబునే
యంబూనిరని వింటి నీవుతత్తద్భార్యలకు రతిజిఘాంసాతృష్ణా
దుల సమీపంబునకుజని తత్పురస్సరంబుగా మదీయమంత్రుల
నూరడింప వలయుననిన దుర్మతి తనవిభునిం గనుంగొని యి
ట్లనియె। భవదాజ్ఞా ప్రకారంబున వారల నూరడించి భవత్స
మీపంబునకుం జెచ్చిననేమి చరితార్థంబవిన మోహుండిట్లని

ఈ నీచేత నూరడింపంబడిరేని కామాదులు ప్రామోదవశే
షోద్యోగంబు మాని పంగారివు సమయంబున మనకు సహా
యంబు సేయుదురనిన యుద్ధంబున నెవ్వ రెల్లయ్యెదరో యని
దుర్మతి రోదనంబు గావింప దాని నూరడించి మోహుండిట్లని
యె నవ్రోహితకీర్తి సమేతుండనగు నేను మత్సమానుండు
గాని వివేకునితో నిప్పుడు సమరంబు సేయుట కుద్యోగింపను
సమర ప్రయత్నంబు కాలాంతరంబున సంభవించెనేని కామా
దులచేత గండణగింపింతువని మరియునిట్లనియె ॥గీ॥ నీకుసము
లైన కాంతలు నిన్ను మించినట్టి కాంతలు మహినిలేనట్టి రీతి
మదధికులు మత్సములు లేరు మహిని బురుషు। లందు నాతోడ
నొకడు పోల్పాడగలడె ॥క॥ ప్రతిఫలితార్కచ్ఛవిభాసితమ
ణిమకుటాన్వితాత్మశిరములు దితిజాదితిజులు పూనుదురప్రతి
హతగతి నే వ్రాసి పంపినట్టి లిఖితముల్ ॥చ॥ దివిజులు నేను
జెప్పినగతిన్ విహరింతురు పద్భటుల్ మహీధవులు లరవింద
వాద్ధవసునాథర సీమలయందు బద్ధసం। భవ హరిరుద్రముల్లోలి
విలుపంబడి రీజగదుద్భవస్థితి। చ్యవనములెల్ల నాదుకనుసన్న
నగుర్ సరిబోల డెవ్వడుర్విసీ॥ కాలవశంబున గడు బ్రకాశిం
పుచు జెన్నుమీరి వివేకుమన్నవాడు। భానుదీధితులం బుదా।
సీకములచేత గప్పంగబడిన వైఖరిని వనితా। మత్కల్పితములై
న మహాయశాస్త్ర భేదములు వేదాంత వాదముల వలన
నాచ్ఛాదితములైనవని తోచుచున్నది కామాదు లొనరించు
కార్యములకు। విఘ్నములొనర్చునట్టి వివేకునిం జయింపజాల
క పరిచ్ఛన్నవృత్తి బూనిరి యెడ నుపేక్ష బూనితినేని వైరి।
సకల జగముల నెల్లను సంహరించు ॥గీ॥ ఇలనభేద భేదముల

ను భేదాభేదములను జేతునిన్సును జలజనయన। చెలగి పూ
ర్వపక్ష సిద్ధాంతముల దల।క్రిందు జేసి రిపుల గెలువ వలయు॥సీ॥
క్షితి నహంకార ప్రభృతి సమ్మతంబును శ్రుత్యంత శాస్త్ర వి
రుద్ధగతియు।సులలిత లౌకిక జనమనోహరమును ధనకామ పు
రుషార్థ దర్పితంబు। చరమ విద్యాలతా శాతకుఠారంబు నివి
ధేంద్రియశ్రమ విరహితంబు। చార్వాక సౌగత శాస్త్రానుగు
ణ్యంబు వైదికాచార వివర్జితంబు। దారుణంబైనయట్టి సిద్ధాం
తమొకటి। నేనుగల్పించి గంభీరమైనవాక్చ। మహిమ్నలిల బెద
రించి శుంభద్గతిన్వి। పేరుని బెంపుపరతు నాళీకనయన॥వ॥
ధరణీ నీరతోశాను వాయువుల తత్వంబులే తదన్యోన్య సం।క
రవిస్ఫూర్తియె సర్వ కార్యములు లోకంబందు గాపించు ధా।
నురిచైతన్యము లాత్మలన్యులనుచుం జూపట్టిరే దేహముల్
దొరుగన్ సౌఖ్యము లబ్బునే గురుమతోక్తుల్ జూడకెవ్వం
డిలన్ ।చ॥ ఉపనిషదుక్తులం బ్రబలు లొయ్యన జెప్పిన యు
క్తిపద్ధతిం। జపలతనేను గాన సద సద్గతులౌ దివిజాసురాళికిన్
గపటములేక జూపు నవికంబుల నేయని చేనివైరుల।తప జ
యు పత్రమిచ్చినం తెరం నన్నెమ్మది నంతసించెదన్ ౪౨॥ స్వ
మతము తిరస్కరించిన పరమతుల లోకాయతన నిగూఢార్థ
ములన్। శమియింప జేతునని నను।దమి దుర్మతి విభునితోడ దా
విట్లనియెన్॥గీ॥ అవని బ్రత్యక్ష సాధితంబైన దేన। గురురచిత
శాస్త్రమొక్కటి కుదురుపడునె। శ్రుతిశిఖానేకకథిత పరోక్ష
విషయ। శాస్త్రములొనర్చు పూర్వపక్షములవలన॥ వ। అ
నిన మోహమిండిట్లనియె।చ॥ పరమొకచోట నున్నదని పల్కె
డు పండిత వేద వాక్యముల్। వరములటంచు బల్కు శ్రుతివర్గ

ము లీగురు కల్పితాగమోత్కర కృత పూర్వపక్ష సముదగ్ర వచో విభవ ప్రసంగ వైఖరులను మానముద్ర పరగఁ వహించుంచు సరోజలోచనా॥క॥ కలశశతప్రతిబింబి కలుషాత్ములు నవికసములు గానిగతి నసంబులుగావు వైదికాగమములులోకాయతనశాస్త్రమునకు లతాంగి॥క॥ అనినం దుర్మతి మోహుని గని యిట్లనె ఘనమతప్రకారమునకు సాయ్యానమోక్షమెద్ది సుఖవర్తనమెద్ది గణింపనేది దైవంబన ఘూ॥క॥ అనినందుర్మతి తోనిట్లనె మోహుఁడు ముక్తి మరణ మంగజుకేళిందనియుట భోగము రతివర్తన సౌఖ్యమొసంగు తరుణి దైవంబబలా॥గీ॥ అతివ తత్వప్రదర్శిని నైనసీకు సూక్ష్మగతి దత్వమార్గంబు జూపఁబడియె నేతదంభోజ నయనా కృపాతిశయము చేవివేకాఖ్యరిపుని నశింపఁజేతు॥ అనినదుర్మతియిట్లనియె క॥ చేతనసహితలు సల్లాపాతిశయాన్వితలు వనితలా వనితల విఖ్యాతా నగ్రహమున నేరీతిజయింతువు వివేక పృథ్వీభర్తన్ ॥అనిన మోహుండిట్లనియె॥చ॥ మునులకు శాస్త్రముల్ నిగమముల్ పఠియించినవారికిఁ యమ బున యతులైన వారికిని బూర్వసమార్జిత వాసనాశ్మభిత్తిని లిఖియింపఁ నట్టిరుచి దీపిత చిత్రములైనయట్టి యంగనలు సమాధి నాశనలు గారె సరోజముఖీ గణింపఁగ॥చ॥ కపటములేక ముక్తిగతి గన్గొని వర్జితసంగులై మహాతప మొనరించు వారుసముదంచిత వృత్తి బరంపదంబునం జపలవిలోచనాద్యఖిల సౌఖ్యములం బరితృప్తులౌదురం యుపనిషదర్థవేత్తలగు యోగులు వల్కు దురాపృత్తులెన్నఁగ॥గీ॥ తేలుగుట్టునని మదిఁ భయమందిన నరుఁడు నర్ప ముఖమునఁ వసింప జనునె యైహికోరు సౌఖ్యముల్ కీ

ద్దైన! బరసుఖంబుమేలు బంతియగునె॥చ॥ తిమిరమువంటి కొ
ప్పు హిమదీధితివంటి ముఖంబు మించుట(ద్దముల జయించు చె
క్కులు సుధ గ్రమరపించెడు మోవి పువ్వుగుచ్ఛముల హసిం
చు జన్నుగవ సన్నపుకౌను గలట్టికాంతలం! దమిని మదింక
లంచుచును! ధైర్యము పూనవశంబె యేరికిఁ!క॥ మారమ
హా గస్గంధా(వారాంతర సంచలిత సువర్ణ పతాకా! కా
రలగు కంజలోచన! లారయజెరుపుదురు ధైర్యమార్యుల కై
నఁ!వ॥ విను మింతియ కాదనాది పరి శుద్ధాంత రంగులును
వైకుంఠ నివాసులునగు వైనతేయ విష్వక్సేనాదులకు బరిణా
య పాపులగు భార్యలు గలరని! పురాణంబుల బలుకంబడు!
సకలసంసార నివర్తకుండగు జనార్దనుండును లక్ష్మీ భూనీలా
నాయకుండని చెప్పుదురు కామ పురుషార్థ పరాయణులైన
వారన్యులను నిష్కాములై యుండుడని బోధించుట తనగృ
హంబు పదిలంబు చేసికొని సమీపగృహంబుననలంబిడు
చందంబని తోచుచున్నది యే దేవుండు ముక్తి(ప్రదుండని ము
ముక్షుల చేతం బలుకంబడునో యద్దేవుండు సత్వ(ప్రదుండు
పురాణ పురుషుండునునగుచు బహుముఖ భుజంగాంగ స
హితుండై మథురాద్యనేక నగరంబుల నపరిమిత విలాసినీ స
మేతుండై సురతవాంఛం (బవర్తించెననుట (ప్రసిద్ధంబుగా వినం
బడు జారాగ్రక పక్ష(ప్రతిష్ఠాపంబు గావించుటయు దివ్యదంప
తులగు లక్ష్మీ నారాయణులకు సత్కార్య ఫలంబు లర్పించుట
యు శత(ప్రదాన (ప్రతిష్ఠాపకుండగు విద్వాంసునకు వింశతిపంచ
కంబొసంగుమ ననిపలుకు చందంబున నపహాసింపంబడు (గ్రా
మ్యంబులగు మోక్ష ధర్మ (ప్రబంధంబుల రచియించిన (బ

ష్యామలకు నిష్ప్రమాణ ప్రయుక్తంబగు బ్రహ్మచర్య ప్రసా దంబు భోగప్రాప్తికొఱకు గల్పింపఁబడియె జగత్కర్తలగు లక్ష్మీనారాయణులకు దాంపత్యంబు సహజంబై చెలంగుచున్న యది తదీయ చ్ఛాయవశంబున దత్కైంకర్యార్థంబు నరులకు గామిన్యాది భోగరచన సిద్ధంబయ్యెఁ గాన శేషిశేషత్వంబు భగవత్సార సంవర్ధకంబై యుండు విద్వాంసులలో గొందరికి జార్వాక శాస్త్రంబుపై వైరస్యంబుదయించుటకు గారణం బు గనంబడదనిన నతనింగనుంగొని దుర్మతి యిట్లనియె

గీ॥ అస్మదీయదాస్య మాచరించుచు జగం।బు నవసించు కాంతలనఘువారి। చేతవిజయలక్ష్మి సిద్ధించునని పల్కె। లింతకంటె మోదమెద్ది చెప్పుమా॥ మ॥ పరమానంద కరాంగనా సురతజ ప్రీత్యాత్మ సంభోగబం। ధురమై భాసిలు తావకాగమ శిఖానూనోక్తమార్గంబులి। త్తరివర్జించి నికృష్ట శాస్త్ర గరణింధాతిం జనుల్ సంచరిం। తురు వారేమి మదిం దలచిరని నన్మోహింపు దానిట్లనెఁ॥ క॥ రమణీయవిచారితమా। ర్గమునఁ బ్రవర్తించు నాస్తిక ప్రబలపిశా। చములం దపరంపరలకు। గమనీయంబైన తోవ గానంబడునే॥ చ॥ అమరగురుప్రణీత మనపాయ సుఖప్రదమైన శాస్త్రమా। ర్గము దిగ ద్రోచి పాకృలహా కౌతుకులైన జనుల్ పఠింతురిం। పమర హిరణ్యగర్భ కపిలాది కృతాగమముల్ కణాదబు। ద్ధముఖ కృతాగమంబులు ప్రధానములంచు సరోజలోచనా॥ చ॥ వినుము చరాచరాత్మమగు విశ్వము కొప్పు మయూరపింఛలో। చనముల కైవడిన్ నవాజసౌష్టవ చిత్రము కంటకవ్రజం। బున కతితీక్ష్ణభావమది పొల్చుటయే గతి నయ్యెనంచు బ। ల్కెను దదీయకారణ మకేం

చనుడైనను జూపనేర్చునే॥ చ॥ అటువల్కం దగదుర్విలోనకి
మె సిద్ధాంతంబు సిద్ధాంతమౌ। న్నటికిం గాదదియంచు బల్కు
కటిాంతర్వాణి సంఘంబుచే। ఘటితంబైన కుతర్క కర్కశ
సమగ్రిగాఁవ మార్గంబునఁ। నటియింపం దలపోతు రజ్జులిది
యన్యాయంబు శాతోదరీ ౪౩॥ నారీ స్వాభావిక గుణమారా
య పడునంగ శక్యమగునె జనులకుఁ। గారణ కార్యోత్పత్తు
లు। ధారుణిలోపలను గాక తాళీయ గతుల్ ౪౪ కలికివిరో
చనుండు చిరకాలము బ్రహ్మనుగొల్చి తత్కృపా। విలసనశక్తి
బుణ్యజనవేద శిఖార్థ రహస్యవేదియై। చెలువలరం బ్రబంధ
ము రచించెను గొందరు తత్ప్రబంధసం। కలిత చమత్కృతుల్
మదినిగానక నిందయొనర్తు రజ్జులై ౪౫ ఇంద్రియాంగ విలయ
మింతి ముక్తియటంచు। గ్రంథకర్త లనుటగాదు నిజము। కుం
భసన్నిభోరుకుచ విరాజద్వధూ। బ్రహ్మభోగమగును బరమ
ముక్తి॥ మ ॥ అనినందుర్మతి భర్తకిట్లనియె మోహానీవు కల్పిం
చుచ। ర్యనమార్గంబున సంచరించుజనులఁ శాస్త్రాంతరస్ఫూ
ర్తిచే। తనునీవైరులు మోహపెట్టి నిజసిద్ధాంతాను కూలప్ర
వ। ర్తనలోజాన్పినశింపజేతురిది ధర్మంబా విచారింపగఁ॥
క॥వారట్లుపరివర్తించిన। నారీమన కేమి వెలితినైజగుణమ నా
చారులు విడుతురెదూరవి। చారుల వారేమి సేయజాలుదుర
వనిఁ ౪౭॥ వేదాంతజ్ఞులు నవ్వుచుం గుసుమతద్వేషంబు రెట్టిం
పను। ర్వాదోల్లంఘున మాచరింపుచును జార్వాకాగమప్రాజ్ఞు
లఁ। వైదగ్ధ్యంబున నిందజేయుచును వాగ్వాదంబు గావింతు
రు। న్వాదస్ఫూర్తిని వారిపల్కులకు జింతం జెందగా నేటికిన్ ౪
వ॥ ఈసమయంబున నస్మచ్ఛిద్ధాంత ప్రతిష్ఠాపన నిపుణు

లైన పురుషు లెవ్వరు గానంబడరని మోహుండు దుమతి తో బలుకు సమయంబున గుహానా సూయా సహితులై దంభ దర్పాలు సమీపంబునకే తెంచి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి దేవా భవత్కింకరులమగు దంభదర్పుల ముభవదాజ్ఞా ప్రకారంబున బ్రవర్తించెదమనిన మోహుండు వారల నాదరించి కామక్రోధాదు లేప్రకారంబున నెచ్చట నుండిరోయనిన దంభుండంజలి గావించి ప్రభుసన్నిధానంబున వాస్తవమ్ము వచియించెదనని యిట్లనియె ననంత విషయస్పృహాంభోధి మగ్నంబైన మానసంబు చెలంగ వలయుసూరుత సమన్వితంబై వసంతసమయంబు విజృంభింప సొప్పికంబు సేయుంజని భయంబున దద్విధంబును జేయుంజాలక పలాయితుండై మన్మథుండు నిద్రితుని చందంబున బరస్వప్నంబు గావింపంజాలక యున్నవాడితరుల తెరం గెరింగింప పలయునే పురుషుండు వివేక ప్రేరితుండగుచు నిజశరీరంబుపై విరక్తుండయ్యె గృపణ జనార్చితుండగు లోభుండు నతని చెంత సంజనలేక విముఖుండయ్యె ననిన దర్పుండంజలిచేసి మోహునితో నిట్లనియె ప్రళయ కాలంబున జతుర్దశ భువనంబులు భస్మీకృతంబు నాశంబున సమయింపంజాలు క్రోధుండు వివేక సంరక్షితుండైన తత్పురుషునిం గాంచి మూర్ఛితుండయ్యె ననిన విని మోహుండు చింతాక్రాంతుండై వేడినిట్టూర్పు నిగుడించి క్రమ్మరదంభ దర్పులం గాంచి యిట్లనియె నస్మదాదుల మందర మప్రమత్తులమై కులనాశనంబు గావింపందలంచి నవివేకుని మదంబణంగించెదము స్వాముల సంరక్షణార్థంబాక వివేకుని జంపుట యధర్మంబని జనులు మసల నిం

నీవు నీభార్యతో, జనుపుణ్యాశ్రీగ నీమనంబు జలికెన్ స్వామీ భవచ్ఛాసనం బున నేనట్లొనరింతునంచు జనియెఁ బోహారుం డు మెచ్చంగమఱి॥ వ॥ తదనంతరంబా మోహుండంతర్గతం బున నిట్లనియూహించె శత్రు విజయోపాయంబును జతుర్వి ధాన్నంబులు పరిపక్వంబు గావించు జఠరాగ్నిని దుర్మతి సహా యుండనై పరిపాలింపవలయు నింతమాత్రంబున సభక్ష్యద్ర వ్యంబులు భక్షింపుచు మృష్టాహారంబులు నంగవింపుచున్ దుష్టమతపరివిష్టుండై శిశ్నోదర సుఖంబులు గోరుపురుషుం డు వివేకసంపన్నుండు గానేరడనుచు దుర్మతింగనుంగొని యి ట్లనియె॥ మ॥ అమరత్స్మాకర కోటులుం రజత శైలానేకముల్ సర్వలోకములుం బన్మభవాండసంఘములు పేట్కౌన్నాకు సిద్ధిం చినం గ్రమశీ నెమ్మది సంతసిల్ల దరివీరవ్రాతసామ్రాజ్యస్థలిం గమ యుం జేయక యున్నటంచు బలుకం బందాస్య దానిట్లనెన్॥

మ॥ అతివిఖ్యాతసన సూచరింప భవదీయామాత్యులం నీవు శ్రీ స్మరసంగ్రామము జేసి పంపవలె నామాటల్ మఱిన్నమ్ము మం చు వింధాసన సఖ్య మోహవిభుడాత్మాంతఃపుర స్థానంబు చే రుదుర్వాసనఁ జొచ్చి యిట్లనియె సంతోషంబు రెట్టింపఁగ॥

క॥ నామంత్రులకడకుం జని । ప్రేమం బ్రాయుంపు మొక్క క్రియలేఖ వసూ। టీమంగి తత్క్రమమెల్లను। నీకాదికిం దేటపడ గ నేనెఱిగింతుఁ॥ సీ॥ శ్రీమన్మహారాజసింహాసనస్థితమహా మోహరాట్సార్వభౌము దెలిమి స్తంభ కామక్రోధ దంభ లోభాఖ్య మాత్సర్య మదాది మత్సచివులకును। సప్తసము ద్రములు సప్తముక్తిస్థానములు దీవులేడును నలలితముగ। నర్పింతుననుచు రయంబున బ్రాయించు మవధి కారమువిన్న

ధికారా। బలరిపునుతసారా భక్త చేతోవిహారా। సలలితమణి హారా శాతకుంభాద్రిధీరా॥ ఇది శ్రీ వేణుగోపాల కరుణాకటాక్ష వీక్షణ పరిలబ్ధ సకల సామ్రాజ్య విరాజమాన రావువంశ కలశ పారావార పరిపూర్ణ చంద్రసమాన నిఖిలశాస్త్ర వాసనాసముదిత విజ్ఞాన శ్రీ మన్మహా రాజ రాజ శ్రీ వేంకట రంగారాయ నరేంద్రపుత్ర రాయ రాహు ద్వేశ్యా భుజంగ సర్వజ్ఞాది మహా బిరుదాంకేయ సమర విదళితామిత్ర రాజాధిరాజ మహారాజ రాజతేజోనిధి మహ రాజశ్రీ రాయణప్ప రంగారాయ నామధేయ ప్రణీతంబైన సంకల్ప సూర్యోదయంబను వేదాంత నాటకంబునందు డంభాద్యుపాలంభమను పంచమాశ్వాసము.



# సంకల్ప సూర్యోదయము.

శ్రీ రమణీనాయక బృం। దారక మునిబృంద మోక్ష
దాయక నానా। క్రూరాసుర సేనాసం। హారక సితదివ్యసాయ
కా వైకుంఠా॥ అవధరింపుము ॥ క॥ తదనంతరమున కంచుకి। ము
దమున నొకడేగుదెంచి మోహుని చెంత। న్మదమున దిరిగెను
దప్పన। కుదయించితి స్తంభుడను బహుజనవిరోధిన్॥ క॥ జగ
తి సదాగమ భయమడ। గగునన్ను జరాఖ్యవనిత యనుకూ
లగతిం। దెగనాడక బాల్యంబా। దిగనవిరళ వళులతో నధి
ష్ఠించెజుమీ ॥ఉ॥ మోహుని ద్వారపాలకుడ మోదముతో
జర నన్ను బట్టెనా। మోహుని యాజ్ఞయుం జరయు మూర్ఖ
తనన్ను జరింపనివ్వరీ। దేహము జీర్ణమైనను మదిన్ వసియించి
న కోరికల్ సభో। వాహినులట్లు జీర్ణవిభవంబు వహించును వే
యునేటికిన్ ॥గీ॥ సకలజనులకెల్ల సాధారణంబైన। జరకు చిం
తజెంద జనదటంచు। ధర్మవిదులు పల్కెదరు దానికేమిరా। జా
జ్ఞ మిగుల దుస్సహంబుసుమ్మీ ॥చ॥ జలధి దరింపవచ్చు బెలుచన్
రణభూమి జరింపవచ్చుగా। వల కరినాచలాగ్రముల వాసము
సేయగ వచ్చుగాని మ। త్యులకు ధనాంధులై ఖలులతో సహ
వాసము సేయు భూమిభ। ర్తలగొలువంగ బోయినను దక్కు
దుమానము వేయునేటికిన్॥ చ॥ అవయవ కంపనర్తిత సమం
చిత కంచుకమై వికీర్ణమై। ధవళతనూరుహోపహసితస్ఫుటయౌ
వనమై స్వతంత్రమై। భవమున నెవ్వేన లేని మెయిమైని జరాప
ర జీవితేచ్ఛచే। నవిరళ రక్తిగల్గిన మదాత్మను నవ్వు మదంత

రాత్మయుఁ॥ మ॥ పరతంత్రుఁడగు వానికిఁ సుఖము సంప్రా ప్తించునే మోహాకిం। కరతండిప్పుడు నాకుఁగల్గ నాకోసౌఖ్యం బా మహామోహుఁడే। కరణిం దిప్పినసట్లు త్రిమ్మరుటయే కా ర్యంబు చారాంబకుల్। ధరణీభర్తఁ లటంచు స్తంభుఁడు సము త్సాహంబున న్నెన్నఁడిఁ ॥వ॥ ఇట్లని వితర్కించె మహామో హుఁడిపుడు చారులవలన విపక్షులవృత్తాంతంబు గ్రహింపం దలంచి పాకశాసన ప్రముఖ విపక్షస్థానంబుల సర్వధర్మనిర్మూ లన సమర్థంబులై విఘ్నరూపంబులగు దూతల నునిచి త త్తద్వృత్తాంతంబులు గ్రహించి తన కెరింగింపుమని నన్నుం బంపిన నేతెంచితి దర్పోఘ్నంబులు పండితులగు మహాత్ములు గావించు యమనియమాదుల గృహీభూతంబులై యుండె మ నోరథ రథారూఢుండై తర్కసారథి సమేతుండగుచువివేకుం డు సంయమి స్థానంబులు గనుంగొన రాగలండే తద్వృత్తాం తంబు మోహున కెరింగించెదనని స్తంభుండు నిష్క్రాంతుం డయ్యె దదనంతరంబా తర్క సారథిం గనుంగొని వివేక రథి కుండిట్లనియె॥

సీ॥ సాధుశాస్త్రప్రరోచన నైనబా కవు వసుధ నిరాక్షేప వర్తనుడవు పరివాధిభీకర ప్రాసంగికుండవు న్యాయంబు ద ప్పక నడుతువెపుడు। ప్రతిమతేతర శాస్త్రబల పరంపరుడవు సూత్రజ్ఞుడవు చక్రచోదకుడవు। ధర్మమార్గప్రవర్తనుడ వా ఖ్యాత చారిత్రుడవు బుధసన్నుతుడవు। నీవు సారథివౌట మ ద్భావజనిత। ఘనమనోరథ సాఫల్య మనఘవృత్తి। బరగున నుచు వివేకుండు వలుకదర్కు। డింపు దళుకొత్త నతనితో ని ట్టులనియె॥ క॥ పరపక్షంబు స్వపక్షం। బిరువుగ నీవాదినిర్ణ

యుంపక యున్నం । బురుషుడు కృత్యాకృత్య । స్ఫురితవివేకార్థ మెల్లు శోధించుమహిని॥సీ॥ జగతివశీకృత సర్వేంద్రియుండగు పురుషునకు నివాసభూమియోగ్య। మగునది యేలోకమం చుభాసిల్లునో యనుచు విమర్శింప నరుగుదెంచి। కొన్ని లోకముల గన్గొనుచు నిప్పుడు మధ్యలోకావ లోకనోత్సేకమున ను। వచ్చిజాంబూనద వసుధాధరంబుపై వసియించితిమిచూడు మదనమెత్తి। మన్మనోరథ చక్రాగ్రమర్దితోరు। శైలములతో డవల ఋత చక్రవాళ। పర్వతముతోడ జలధి సప్తకనకకూల ఫలితితో నొప్పు ధాత్రిని వేడ్కమిగుల॥వ॥ అనినవివేకుండిట్లని యె॥గీ॥ త్రిగుణ మరు[illegible]లందు నదిరిగితిరిగి। తన్నువైనట్టి మనుజుల భేదముడిపి। కామితార్థంబు లొసగు నీకాంచనాద్రి మగనుగొంటివే తర్కనామధేయ ॥గీ॥ శేషనాళ విరాజిత క్షితిసరోజ। కర్ణికాకృతి దనరారు కనకశిఖరి। సీమయందు మగంటివే కామితార్థ। దాయకమ్ములైన దేవతాతరువనము ॥చ॥ విలసితచంచరీక పరివేష్టితమై కమనీయ పుష్పనిర్గళి త మరందనిర్ఝర విరాజిత చారుతరాలవాలమై। ఫలపరి పూరితోరు విటపవ్రజమై సురదంతిధామమై। చెలగెడు దేవతావిపినసీమ గనుంగొను మింపుమీరగ॥చ॥ అలఘుతరోరుదాన జనితాధిక కంపనమేత గండసం।చలన [illegible] షట్పదమ్ముపాకృత చామరభా సమానమై। జలధి నటద్గిరీంద్రకటు సంజనితా [illegible] ధా [illegible]కుంభమో।జ్వల రుచిరమై చెలంగు సుమసామజమాళిని జూడు వేడుకన్॥శా॥ సంతానద్రుమ పుష్ప బృంద నటనాంచత్కారణంబైన భో।దంచత్స్థూల కరాగ్రశీకర గణాదరాంబై లతా। తాయుధా। నంతోదేశిక చరత్సవ

క్వ జలజాస్యా పుష్పమాలా సమాశ్రితింతో ద్యత్కచాళి తంబగు జగత్ప్రాణంబు వీచుంజుమీ॥ గీ॥ చారుతరమైన యీ హేమశైలమెన్ని దివసములు జూచినను దృప్తి దీరదనఘ। కే సరీకృత కేసరగిరియు తామరాద్రి కర్ణికా భూపద్మమని గ్ర హించు॥ చ॥ భువనములెల్లజూచితిమి భూమిది వర్గ సుఖాస్ప దంబులై। యవిరళవృత్తి భాసిలు సమంచిత వర్షములం దశ జించి వైభవముచెలంగగా నడుపు భారత వర్షగతిన్ రథం బు శాత్రిపులు చలింపగానవిన దర్కుడు దానటుచేసె వేవ్రి ల్మీడిన్॥ చ॥ చనునెడ మార్గమధ్యమున శంకరశైలము జూచి తర్కునింగనుచు వివేకుడిట్లనియె గాముని గెల్చిన దేవుడీ న గంబున వసియించు నిగ్గిరి విభుత్వము జూతునటంచు బల్కి నన్ విని యతడట్లు చేసిన వివేకుడు తర్కునితోడ నిట్లనెన్॥

చ॥ హత కుసుమాయుధుండగు పురాంతకుడీ రజతాద్రి యందు సంతతము వసించుగాన జపతంత్రము లిచ్చట జే యరాదు పండితులకు సామజాస్యముఖ నిస్రుతదాన ఝరీక లింద జాసితలహరీ పరంపరలచేతను గంబళితాకృతిం దగున్ క॥ అనుచు వివేకుడు పలికిన। విని సారథి యతనిరథము వే టున నడుపుచుం। గనుగొనియె మార్గమధ్యంబున సుందరగిరి ని మోదమున మదిచెలగన్॥ వ॥ అరదంబచ్చట నిల్పిచూడుము వివేకా మందరాహార్య వైభవరులంచుం బలుకన్వివేకుడు మ హాగంధర్వ సంగీత భాసురమైయొప్పు తదద్రిజూచి పలికె నూతాభవ్య మ్మనోహర సౌఖ్యంబులకెల్ల మూలమిదియే యంచున్ దలంతున్మదిన్॥ గీ॥ సిద్ధసేవ్యంబుగాదు వీక్షింప నే తాదద్రి సాధకులకు నివాసార్హమగును। దేవతలకెల్ల సీధరిత్రి

ఖరంబు। మరణ విరహితమై నట్టి మందో సంగ్రహద॥ ప్రియతో
మ సేవ్య హాన శబరీ కబరీ విలసత్ప్రసూన సంచయ సముదీరి
త ప్రబల సౌరభ సార ధురంధరంబులై। భయకరహితేభ గండ
యుగభద్ర మదార్ద్రములై చెలంగుచున్। జయ దళుకోత్త
మారుత వితానము లీనగమందు భాసిలున్॥క॥ అనుచు వివే
కుడు వల్కిన।విని తర్కుడు రథమునడిపి వేరొకట తపోవన
మగ్రభాగమున గను।గొనిచూపె వివేకునకు నకుంఠితబుద్ధిన్
గీ॥ తత్తపోవనంబు తరుకొండు చూపెన। వేటగ జూచుచును వి
వేకుడెలమి। సారథీ మదీయ సారథీయనిపిల్చి। యతనితోడ
నిట్టులనుచు బలికె॥చ। స్వరచిత జానకీరమణ సంగరరంగ క
థాపరంపరా।పరివృత కావ్యగాన పరపండిత సేవితుడై రణా
వనీ। భరణయుతాంగుడై కనక పర్వత సన్నిభ కాయుడౌ
కపీశ్వరుడొక డవ్వనంబున నివాసము జేయుజుమీ ముదం
బునన్॥మ॥ ఫలమంచున్ రవిబింబమీతడు భుజింపం జూచె
నాగాంతకా। నిలుకన్ వేగమునం జయించె మహనీయస్ఫూ
ర్తి లంకాపురీ। నిలయంబుల్ నిజవాలవహ్నికొసగెన్ నిశ్శం
కితుండై రణస్థలి లీలారథమయ్యె రాఘవునకీ సామీరి సా
మాన్యుడే॥సీ॥ శ్రీరాము డవతరించినరీతి కౌశికు జన్నంబు
గాచినసరణి శిలను। విల్లుఖండించిన విధము జానకిని వివాహ
మై దగునట్టి వైభవంబు। భార్గవరాముని భంగించు క్రమమును
ఖరాదులదును మాడినట్టిసరణి। జలధిగట్టినకథ సకలరాక్షసు
లను జంపినకథ విభీషణుని కఖిల।విభవములు కృపజేసినశోభ
వృత్తి। ప్రబల పట్టాభిషేకసంభ్రమము మొదలు। గాగల రఘూ
ద్వహుని సమగ్రాగమములు। గాన మొనరించు నిమ్మహా కపివ

రుండు ॥ శా॥ ఈ రామానుచరుండు నిర్జరళిత పుష్పే
షుండు నిద్రోణవనం । చారుండై తగుగాన సీతనిసివాసంబందు
నిత్యంబుగాం । ధాగ్రామసమగ్రగీతయులు గంధర్వోత్తముల్
పాడుచుండ్ । దోరంబొప్పగ సంచరించెదరు । సిద్ధుల్ నిల్వరా
దీయెడన్ ॥ చ॥ శ్రుతిసురభీకృతంబులయి శోభిలుతంతులెబుట్టి
నట్టిరం । కృతములసుస్వరప్రకరగుంభిత మూర్ఛనలం జెలంగుగీ
తతతుల సంవిధాను గుణతత్వ విహారము మానిచిత్రమల్ ।
వితతగతింజలించు బృగపీస్థలిరాగము బూనుకైవడిన్ ॥ గీ॥ సక
లగీతవాద్య చాతుర్యములుసమ । పమున జరుగునపుడు పం
డితులకు । శక్యమగునె విషయచయపరిత్యాగంబు । సంశయుం
పవలదు స్వాంతమునను ॥ మ॥ స్వరహస్తంబున నిల్పుసర్వను
బలా మంజీరనాదంబుత । త్తరుణీస్పర్శన దర్శనాను స ౹ ణా
ద్యక్రీడలంబుట్టుత । త్తరపాటుల్ గణియింపనేమిటికి ముక్తిశ్రీ
ణికైసందలో । నరులంజూచిన పేళబుష్పశరసంతాపంబు వాటిల్ల
దే ॥ క॥ పురుషుండు కథననియమ । స్ఫురణాన్వితుడై నేమిను
దలీవై శ్వానర కుండికాంతికంబున । బరగెడునవనీతకుంభ పక్ష
తినఘూక ॥ అనిన దక్షుండరదము । వినుతగతిన్ నడుపుచును
వివేకునితో నిట్లనియెన్ హిమవత్పర్వత । మనఘా యిది కీర్తి
యతిశయముగను గొనుమా । క॥ సంతానవకీలతాదుల । సక
లముఖుల్ సకలశైల సముచ్చమహిమల్ । సకలవిభవాతిశయ ము
ములు । ప్రకటగతిం గలిగి యిద్ధరాధరమలరున్ । మధ్యసగమ్యం
దంబుల కీశుఁడై శివుని కెన్నన్ మామయై యాదితేయ గిరీంద్రం
బున కల్లుడై యవని కుద్యద్భృతప్సమై మేనకునగ్రజుఁడై మంచుకు
జంద్రశాలయ యిన్నై నాకబ్రకీం దండ్రియై । దగెసుభూభృత్కం

బు దీనిమహిమల్ తర్కింపగా చిత్రముల్ ౪వ. అనినవినినివే
కుండు తర్కనితో నిట్లనియె నీనగంబున భగవతి యగు
భాగీరథింజూడు మనిమఱియు నిట్లనియె౹౪ మ౹ కలవుర్వి౯ బ
హువాహినుల్ మహిమశృంగక్షుణ్ణకూలచ్యుతాఖిల సంకా
న్వితవారిపూరిత లసంగీకార లీగంగతో౹ దులసేయఁ బల భిన్న
ధూగణ సముత్తుంగ స్తనద్వంద్వమంజుల కాశ్మీరయుతాం
బు పూరయిదియోసుమ్మీ వితర్కింపగ౯ ౪ క౪ ఈధరణీధరము
సను దపోధనులు వసించి శ్లోకేజఁబొందగవచ్చు౯ ౹ మాధవ
చరణజతటినీ౹ సాధుర్ఘురీముఖరితోరు సానువిదిసుమీ ౪
క౦౪ వినుసంయములకు నిచ్చట౹ నునికి దగదుతుహీనపూరి
తోదకములు మూఁకొనుటకు నైనన్ వాటంబనితోచదు శై
త్య సహితమగు నగమిదియే ౹౹శా౹౹ ఆరామాగత దేవతాని
ధున పుష్పాస్త్ర హావాయాస సంహారం బేపునజేయుచుఁ దు
హిన సిక్తాంగంబు లొప్పార నీహారాంశు స్ఫురదం కతుల్య
మృగ నాభ్యంచత్సు పర్వాంబుజాక్షీ రమ్యానన వాసితాని
లములం జెన్నొందు నియ్యద్రియఁ ౪వ౹ కావున నార్యావ
ర్త దేశంబునకు రథంబు నడుపుమనిన నతండట్లుసేయ ని
వేకుండు తదార్యావర్తంబున కేతెంచి తత్ప్రకారంబు తె
ల్లంగనుంగొని తర్కనితో నిట్లనియె నవయౌవన దుర్మదాం
ధ నారీకృత దురితోపప్లవంబుల దూషితంబులయ్యెను౹ నన
పాయ పతివ్రతా పుణ్యబలంబుల నిప్పటికిని జాతులీ దేశంబు
నజెడకయున్నవి యనినదర్కండతని కిట్లనియె వివిధ తీర్థం
బులును దపోవనంబులునుం గలిగి హిమవద్వింధ్య మధ్యప్ర
దేశంబు భాసిల్లు ననినింటిమి౹ యిప్పుడిచ్చోటికిం బ్రవేశించితి

మి తీర్థయాత్రార్థంబు బహు దూరదేశంబులనుండి చే
నుదెంచిన పుణ్యాత్ములు పుణ్యలాభజనితానంద పూరితహృ
దయులై గజస్కంధాధిరూఢుల తెఱంగుననున్న వారు కనుం
గొనుమని విన్నవించి ప్రముఖ దద్దేశసంగతులెల్ల విమర్శిం
చి వివేకునితో నిట్లనియె నిరంకుశ కలియుగ బలసంకుచితని
గమమార్గంబులు గలయీదేశంబుల బ్రాచ్యోదీచ్య పా
శ్చాత్త్య పాషండగణంబులు వర్తింతురు ధర్మదేవతకుఁ జ
రణత్రయంబు భగ్నంబయ్యెఁగాన మురభిదవతార నిర్ము
క్తకలషంబగు సాకేతజనపదంబు జూడవలయు నిది సాకేత
పురంబు వైకుంఠతుల్యంబది విరజానదీతుల్యయై తనరు సదియె
సరయూనది తత్తీరంబున బహుమాత్రవిహీనంబులగు యూప
స్తంభంబులు సీతావల్లభుని ధర్మప్రచారంబులు ప్రకటంబుగా
శంపుచున్నయవి నిజపదంబునకేగు సమయంబున నమ్మహా
నుభావుండీ పురంబున వసియించు జంగమస్థావరంబులకు సా
లోక్యంబొసంగె ననినవిని వివేకుండిట్లనియె ॥చ॥ నిపుణులవే
దశాస్త్రముల నింద్యగతిం బఠియింపుచుండు నియ్యుపవనకీర
బృందము సమున్నతి భానుకులేశులైన భూమిపతులు పాతి
నట్టి హయమేధ మహాధ్వర రత్నయూపములు । ఉపితల రీతి
భాసిలును । నన్నుతిసేయ దరంబె యీనదిన్ ॥చ॥ ధరణిదశేం
ద్రియాస్యసముదగ్ర మనోరజనీచరేంద్రునిన్ । స్థిరతరసత్కృ
పానిశితదివ్యశరంబుల గీటణంచి సత్పురుషులకెల్ల నిచ్చువర
దుండు మహాత్ముఁడు జానకీమనోహరుఁడు దయాసముద్రుఁడ భ
యంబెలమి న్నినువేయు నేటికిన్ ॥మ॥ అనుచుం బ్రాంజలి
నై వివేకుఁడు దశాస్యధ్వంసికిన్ మ్రొక్కి యిట్లనియెన్ నీ

టులు క్రీడసేయ దద్వనితల వస్త్రముల్ గొనుచు దస్కర
వృత్తి హరించి చేరఁ బండనరున మేరు వెక్కినను దద్వసనంబు
లు వారు వేఁడ దనకు నమస్కరింపు డను దైవము మమ్ము
ను బ్రోచుఁగావుతన్ ॥ ఉ॥ ద్వారక వార్ధిఁ గప్పఁబడు వైఖ
రి గప్పఁబడెం జుమీ దురాచారుల చేత నీ మధురసంయము
లిచ్చట నిల్వరాదు యెవ్వారికినైన గాలగతి వచ్చుఁజుమీ విప
రీత వృత్తులీ ధారుణియందు సందియము లేకన్ మదిన్ విమవం
దగుం జుమీ ॥ క॥ అనిన వివేకునితో నిట్లని యెందకుఁ డుపరా
త్పరా విభావంబున మథురా సాకేతము లనఘ పవిత్రంబు
లయ్యె నన్నిటి కంటెన్ ॥ క॥ వినుమీ క్షేత్ర ద్వితయంబున
కంటెను యోగ్యమైన పుణ్యస్థల ముర్విని గలదే భావింపగ
ననుచు న్వేరొక్క చోటి కరదము బట్టెన్ ॥ చ॥ చనజనమా
గన్ మధ్యమున జక్రసమేత శిలాభిరామమై తనరుచు విష్ణు
దేవుని విధంబున బండిత సేవ్యమానమై ఘనతర చక్రతీ
ర్థన్ పరికల్పిత ముక్తివిశేషమై చెలంగిన ఘనపుణ్య భూమి బ
రికించి వివేకుని తోడ నిట్లనెన్ ॥ చ॥ అనఘులు పుండరీకము
ఖులాత్మను మోక్షముగోరి యీస్థలంబున వసియించిరీ య
నఘ భూమిని భాసిలు తీర్థమందు మజ్జన మొనరించు సజ్జ
నుల జక్రధరుండు భవాబ్ధియందు మజ్జన మొనరింప నీయడ
నిశాస్త్రవిదుల్ వచియింతు రెప్పుడున్ ॥ వ॥ అనిన వినివివే
కుండీ క్షేత్రంబు పుణ్యతమంబైనది సందేహంబు లేదు గాని
యిచ్చోట వసియించుటకు మనసొప్ప దెట్లనిన సాలగ్రా
మ శిలాగర్భన్ స్థితకనక కణికాలుబ్ధ పరివృతంబగుట బరబ్ర
హ్మధ్యాన సుధామనోహరులగు ముముక్షు లిచ్చోట వసియిం

వ రాద నిన దకుఁడిట్లనియె। భాగీరథీతరంగ ధౌతపర్యంత
భాగంబున దపంబుగావించు మునిపుంగవులచేత సేవింపబడు
వసుమతీలలామ భూతంబగు వారణాసీ పురంబున రథంబున
డు పుదుననినవివేకుండట్లు కావింపుమనిన నతండవ్విధంబున రథం
బు వారణాసీ పురంబున నిలిపిన దకుఁ నితో వివేకుండిట్లనియె॥
చ॥ శివునినిరీక్షణంబుననశించిన కాముడు క్రమ్మఱన్ రమాధవుని
కృపం జనించి వసుధన్విహరింపుచు నిమ్మహాస్థలిన్। వివిధ తప
స్వి కోటులకు విఘ్నము సేయడటంచు సంయమి। ప్రవరులు మో
క్ష కాములయి ప్రత్యహము న్వసియింతు రెప్పుడున్ ॥ఉ॥ ఇం
తియె కాదు వాధిన్ తనయేను నెఱుంగని వారికైన బ్రాణాం
తము వచ్చినప్పుడు పురాంతకు డీస్థలమందు వేడ్కవేదాంత
రహస్య మంత్రములు దారకతిం దెలియంగ జేసి దేహాంతము
నందు ముక్తికిరయంబున బంపుదయా సముద్రుడై ౪శా౪ ఈ
కాశీపురి యోగ్యమైన నవుగాకిచ్చోట నున్నట్టి వారెకా
లంబునన్నైన సాగరసుతాధీశు న్మదిన్మెచ్చర। స్తోకార్థిన్ చ్ఛాజ
రింతురాగమ సపత్నుండీ పురస్వామి సుశ్లోకుండిచ్చట నుం
డరాదనుమ దోమన్ దకన్ తకింపగన్ ॥ శా॥ ఆకంజా
క్షు కథావిహీనము లయోధ్యావంతికా కాశహా। స్తి కాంచీ
మధురా ప్రయాగ నగరీ శ్రీశైల సింహాద్రి మాయాకాశీ
ముఖపుణ్య భూములిల నల్పాటన్ దదీయస్థలా। నీకంబందు
వసింపగా మదికి నున్నేషం లేదెంతయున్౪ క॥ విటులు వి
దూషకులల్పులు! నటులుంగాయకులు పుణ్య నగరంబుల ను
తౄ టవృత్తి దిరుగుదురు మిక్కుటమగు మోహుని బలంబు
కలసమహాత్మా౪ క॥ ముక్తి ప్రయత్నపరులగు। భక్తులు గనప

దరు భూమిభాగమున ధనాసక్తులతో నేగతి నను రక్షించి హరించి రిపుల రణమున గెల్తుఁగా॥ చ। కలియుగశక్తి చేత ననఘంబగు మర్త్యమలోకమెల్ల నిర్గళిత సమస్త ధర్మమయి కల్మషపూరితమయ్యె దివ్యభూములుగల దక్షిణంబున సనోఘులు వైష్ణవులుందురంచు పెద్దలు వచియింతురొ య్యానకథంబుగదల్చుమ సంశయంబుగన్ ॥ క॥ ఈ వింధ్యభూమి సుజనాభావము కీకటకిరాత పరివృతనగుటన్ । ధీవిలసితు లిచ్చోటను । గావింపగరాదు సుమ్ము కాపురమనఘా ॥ గీ॥ మృగమరీచులుగల మరుమేదినిబలె । బౌద్ధపరివృతమైన సభాస్థలివలె । విటనటాక్రాంతమైన యీవింధ్యభూమి । గోరి వసియింపగారాదు కోవిదులకు ॥ ఉ॥ భానుమరీచితప్తమగు పాంథజనుండొకడీమరుస్థలిం దానొకయంధకూపమున దప్పఘటంబున నీరుదోడితఁ త్పానఘటప్రపీతసము దగ్రపయఃపరిశేష నీరముల్ । విములనఖులన్ హృదయ వీధుల జల్లుకొను౦ దపించుచున్॥ వ॥ కొందరు ధనవాంఛన్ ధర్మకామంబులు పరిత్యజించి కీకటకిరాతాశ్రయంబులగు పరభూములయందు వాణిజ్యంబునకై ప్రవర్తించుచు సన్మోదక ప్రముఖ వస్తుసంకోచంబున దుఃఖింతురు విను మేతద్దేశాధిపతులు ధర్మమార్గంబు లెరుగక మోహబద్ధులై నయానయజ్ఞాన శూన్యులగుచు వర్తింతురు । మరాపానంబు గావించుచు ధనమదోన్మాదంబున సాధుజనులగు విద్యాధికుల ద్విజ హేయంబుగా నవమానింతురు నర ప్రప్తిహేతువులగు దౌర్జన్యంబులు గావింతురు । పరమేశ్వరుండీమహీపతుల నేమికారణంబున బుట్టించెనో తెలియదు కొందరు పండితులు మహానుభావులగు రాజుల సత్కృతి వి

సనాథంబు ధరణిదుర్జనులగు భూపతులం బరమేష్ఠి పుట్టిం
చెనని చెప్పుదురది యెట్లనిన। దొలుత దేజఃపుంజంబు సృజి
యించి తదుత్కృష్టార్థంబు తమఃపుంజంబునుం బుట్టింపఁడాయె
నియందురు వినుమేతత్పూర్వపక్ష సిద్ధాంతంబులకుం బనిలేదు
రథంబు నడుపుమనిన దరుకుండట్లగావింపుచు మార్గ మధ్యం
బున వివేకునింగని యిట్లనియె॥ చ॥ విడిచితిమిప్పుడే శబరపీ
రవిజృంభితమైనవింధ్యమి। కక్కడగనుపట్టువాలిపురిగన్గొను మ
ల్లదె దేవదీర్ఘికం। గడువడిమించు సహ్యగిరి కన్యకనంబు తి
రస్కృతతామ్రతన్। బుడమి జెలంగు వైష్ణవులపుణ్యము నంబ్ర
వహించువాహినిన్॥ వ॥ అనినవివేకుండిట్లనియె॥ గీ॥ దక్షిణా
శాథగిరథతనయ మధుర। సలిలపూరితయీనది చౌర్యగుణధు
రీణు లీనది చెంత వర్తింతు రల్పు। లాగమాంత ప్రవర్తకులై
నరీతి॥ క॥ ఈవొంగలచేత యతీం। ద్రాదిమహోత్తములు మనో
వ్యథాన్వితులగుచున్। ఖేదమున జరింతురుకద। లీదశములు
వాంతహాతి జలించినరీతిన్॥ క॥ చరమయుగభటులగతిఁగొండ
రు నీచులు సిగ్గులేక ధరణీహార। స్ఫురదగ్రహారముల కాతుర
తజనింపంగ జేయుదురు సంతతము॥ మ॥ కలియంగట్టినబో
దుమానరిల ముక్తాహారసాంగత్యముల్। గలుగం దన్గరువృత్తి
కంతరము వేటర్జూపరుస్నాగమం। బుల శైత్యంబును శీత
లాగమములన్ భూరిప్రతాపంబుని। శ్చలతంబూనుదురు కేతను
స్నాతకులల్ శ్యామాకుచపాళియుల్లై॥ మ॥ అనినందరుకుండున
ట్లీనదితటంబున దా సురాచార్యధీ। వినుతుల్ విష్ణుపదాబ్జ
సక్తహృదయులి విద్వజ్జనుల్ సంతతం। బును సేవింపజెలంగు
యాదవగిరిం బొల్పారుచున్ గన్గొనన్। వలెనీపర్వతమాయ

దూద్వహునకావాసంబుసుమ్మీ మహిం॥ చ॥ హరమతశపం
కమందు గపిలాగమవాగురయందువిశ్వస్య। ద్విరచిత యంత్ర
తంత్రముల వీధి గుదృష్టిముఖంబునందిర। స్ఫురణమతి వ్యాసింపని
జగత్పతిహస్తముబట్టినట్టినే। ర్వరిపరతత్వవేది యతిరాజశిఖా
మణి సెన్నశక్యమె॥ క॥ ఇలముని సేవితమైని। ర్మలవత్మీణ బ
దరికాశ్రమంబనగాజె। న్నలరుచు నారాయణగిరి। యలరుం బ
రికింప లక్ష్మణాశ్రయమగుచుం ॥మ॥ కమలాకౌస్తుభభాసమా
నుడగుచుం గంసారివైకుంఠసం। యమిబృందంబులకుం బ
లెం గురుతరాహ్లాదంబువిద్యోర్మికా। సముదంచత్కలశాబ్ధి
బంధురయతీ। శగ్రామణిస్థానమై రమణీయంబగు నిగ్గిరిందిరు
గుమర్త్యశ్రేణికిచ్చుం గృపం ॥చ॥ అమృతరసాధిక స్ఫురద
పాంగ విరాజిత లోచనాబ్జవి। భ్రమ విరళీకృతస్వపదభక్త।
మనోరథ దానదీక్షుడై। యమిజన సేవ్యుడై సురుచిరాభయ
దాన సమర్థుడై మహిం। సముచిత వృత్తినొప్పు మధుసం
హరునిం నుతింతురుత్తముల్ ॥ వ॥ అనిన దర్పనితో వివే
కుండిట్లనియె సహ్యాపర్వత సమీపంబీ స్థలంబగుట సహింపశ
క్యంబుగాని గంధవహ స్పర్శనంబున దుర్బలబుద్ధు లిచ్చోట
వసింపదగ దింతియెకాదు కర్ణాటదేశ రాజ్యలక్ష్మికి గర్ణా
లంకృతంబై చెలంగు నేతద్యాదవశైలంబు నివాస యోగ్యం
బనిచెప్పితి వదియట్లుండనిమ్ము తక్కిన దివ్యస్థానంబులు గనం
గొనుట కన్యస్థానసం బుద్యుక్తంబై యున్నయది రథంబు
నడుపుమనిన నతండట్లుగావించి మార్గమధ్యంబున భాసిల్లు
పరశురామాశ్రమంబు వివేకునకుంజూపి తరుణుండిట్లనియెదం
భోళిదారుణ పరశుదారిత దుష్టరాజన్య రుధిరభరిత ఒహూ

కాసారతర్పిత పితృసమూహుండును। పాత్రార్పిత భూమండలుండునునగు భార్గవుని నివాసంబు గనుంగొనవలయు। నిక్కడను నాభీకమలంబున వసియించు వనజగర్భుండు కాలకంఠుండేనను సకలదివిజులును విష్ణుపదంబెరుగమని వచియింపుచుండ నాకర్ణింపుచు బద్మనాభసమాఖ్యుండగు పరమాత్మ లక్ష్మీసమేతుండై శయనింపుచున్న వాడనినవిని వివేకుండు తర్కునితోనిట్లనియె ॥మ॥ ముదమొప్పార కుఠారపాణి యనుచున్ ముయ్యేడుమారుల్ మహా। కదనక్షోణి నృపాలురం దునిమి తత్కాయ స్ఫురచ్ఛోణిత హ్రద సీమం బితృతర్పణంబు జనులాహ్లాదింపగాఁజేసి భూ। త్రిదశశ్రేణినుతింప భాసిలు కుఠారిఁ గొల్చెదన్ వేడుకన్ ॥ఉ॥ భూవరులన్వధించుచు విభుత్వముమీర మఖంబుఁజేసి భూ। దేవులకుర్వియిచ్చి తన తేజము దిక్కులు పిక్కటిల్లగా। గేవలవార్ధిదత్తమగు క్షేత్రమునందు వసించు భార్గవుం। డీవిపులప్రపంచముల నెల్లను వేడుకఁబ్రోచు గావుతన్ ॥చ॥ మలయగిరిం దరివాసులగు మానుల కెల్ల నివృత్తి ధర్మముం। బలరగఁజేసి తక్కిన జనావళి కెల్ల బ్రవృత్తి ధర్మముల్। దెలుపుచు వార్ధిదత్త వసతిన్వసియించు కుఠారపాణికిన్। బలుమరు మ్రొక్కుచున్ బరమపావనులీ జనులైరి వేల్మిడిన్ ॥మ॥ జనులీ క్షేత్రమునందు గొందరశనేచ్ఛన్ లబ్ధసన్న్యాసులై। యనయోపార్జిత విత్తమత్తులగు దుర్వ్యాపారులంగూడి పాపనులైనట్టి ముముక్షులోటి గుహానావాక్యోపదేశంబులన్। ఘన మోహాంధుల జేతురిచ్చుటను వేట్కన్ నిల్వరాదేరికిన్ ॥మ॥ అనినం దర్కుడు చందనాద్రికి రథంబక్షీణ శక్తిన్ రయంబున బోనిచ్చి వివేకు

నింగని గుణాంభోరాశి యియ్యద్రిచం। దనశ్శైలంబు ఘటో
ద్భవాశ్రమము తథ్యంబంచు బల్కుచున్ ముదంబున వీక్షించి
వివేకుడిట్లనియె సద్బుద్ధుల్ మదిన్మెచ్చగన్ ౪౫॥ జలధిం బా
నముజేసె నానహుషునిన్ సర్పంబుగావించె నిశ్చలతన్ విం
ధ్య మదంబణంచె సముదంచత్స్ఫూర్తి వాతాపి మాంసల
మాంసంబు భుజించె దక్షిణమహాశా సంచరద్దైత్యులం। దోల
గించెన్ గలశోద్భవుండు గుణవంతుల్ మెచ్చ రేయాతనిన్ ౪
శా॥ ఆవాతాపి శరీర మాంసము సముద్యత్స్ఫూర్తి భక్షిం
చి పారావారోదకముల్ కరంబున సమగ్రస్ఫూర్తితో గ్రో
లుచున్। దేవేంద్రాతిశయాన్వితున్ నహుషు ధాత్రింగుండ
లింజేసి నానా విద్వన్నుతుడై చెలంగు మునినెన్నన్ శక్యమే
యొరికిన్ ౪౮౪ నిరవధిక ప్రభావ మహనీయ చరిత్రుడు వేద
వార్ధిన్ బంధురతర కర్ణధారుడు మనోహర వర్తనుడైన
కుంభజుండిరవగు కాలమందు నుడయించిన నీరములట్ల నిర్మ
లస్ఫురణ వహించు నస్మదురుపుణ్యములెల్ల విచార మేటికిన్
ఉ॥ ఈ మునివాసమందు బగలించుకయైనను లేవు తాప
ముల్। యామినులందు శీత భయమారసి చూచినలేదు సిం
హముల్। సామజముల్ సఖిత్వమున సన్నుతికెక్కు శుకంబు
లెల్ల విద్యామహిమం బఠించు నిగమాంతము భూరుహ శా
ఖలెకుచున్ ౪౯॥ ఈ మునికిన్ సఖులైన మహామునుల స
దాశ్రమంబులనఘాం యొతత్సామీప్యంబున దనరును। గా
మితసకలార్థన్ దాయకములై జగతిన్ ॥చ॥ లలితములైన
స్వాశ్రమములన్ శ్రుతిపాఠకులై సదీక్షులై। యలరుచు య
క్షే కముః ములయందు జరించు మహానుభావులు। బలుమ

రు ధర్మపత్న్ని లెడబాయక యుందురు జీవసంయుతం। బులయి
న మేనినీడలను బోలిమనంబున కబ్రిమయ్యెదర్ ॥ శా ॥ ఏ
లాలింగిత చందనంబయి వనంబేపారు ముత్యాలకు। స్నాలంబి
చ్చటి తామ్రపర్ణి క్రిముకంబుల్సాడ నొప్పారు దాం। బూ
లీయుక్తముల్లై పటీరలలితంబుల్ వాయువుల్ మోగులీ। నే
లన్నిల్చిన భోగులయ్యెదరు సందేహంబు లేదెంతయున్॥

క॥ కాంతలతో నిర్జరులీ। కాంతార నికుంజములను గలి
సి తమిని వర్తింతురు మునులిచ్చోటను। శాంతికొఱకు దప
ము సేయ జనునే చెప్పుమా ॥వ॥ అనిసం దరుకండు వివేకు
ని చిత్తమెరింగి రథమకుటిలత బోనిచ్చెను పాండ్యదేశము
న కొయ్యాన నలకృత సేతుయాత్రి కధ్వంబనుచున్ ॥వ॥ అ
చ్చోట రథంబునిల్పి వివేకునితో నిట్లనియె నిది పాండ్యదేశం
బు సేతు యాత్రాపరులకు మార్గంబు వినుమీ పాండ్యదేశం
బునందు వేదంబులకెల్ల నాధారంబును వేదాంతంబులకు నా
టపట్టును। సాత్విక గుణోచ్చాటిత గాఢాజ్ఞాన తిమిరంబును
నగు శఠరిపుప్రబంధంబు సంసార సముద్ర మగ్నులగు జనుల
కు మోక్షప్రదర్శకంబై విలసిల్లు నింతియెకాదు చందనా చ
లానిల చలచ్చ్యుత శాఖాతాడిత సుధాకర బింబచ్యుత సు
ధారస సంవర్ధిత జలప్రవాహ పూరిత మంజీర నది విరాజ
మానంబగు వృషాచలంబు గనుంగొన వలయు। ననిన వివే
కుండిట్లనియె నింతియెకాదిచ్చట విహరించు జనులు తామ్ర
పర్ణీ తరంగ సహోదర సరస్వతీ విరాజితుండును। విష్ణుజీ
వాతుండును నగు శఠారికి సంతతంబు నమస్కరింతురు। పర
మేష్ఠి నీచేతం జూడంబడి యిప్పర్వతంబున సంతుష్టుండగు

వృందావనపతి యిప్పర్వతంబున విహరించు సునాసీరుండిచ్చో టనే వసియించి లోకత్రయంబు బరిపాలించుమనని చెప్పి దక్షిణభాగంబున భాసిల్లు సేతువు గనుంగొని క్రమ్మర నిట్లనియె॥

మ॥ ఇలలోమందర ముఖ్యశైల శిఖరాహీనోపలంబుల్ కపీంద్రులు వేట్కఁ దనచేతికిచ్చినను సంతోషంబు రెట్టింపగా। నలుదుద్వృత్తిని గట్టె సేతువు నదీనాథోర్మి ఘంజంబు లంజలసంబంధదు జానకీధవుని భాస్వత్కీర్తికిఁ మూలమై॥

చ॥ అనయంబు న్నలహస్తకీలిత గిరీంద్రాస్ఫాలనా మేడితాంబునిధి క్రూరనినాదముల్ చెవికి దంభోళిక్రియఁ సోకగా మునులేరీతి సమాధిపూనుదురు సమ్మోదంబుతో నీస్థలంబున కేకాన్యముగా రథంబు వడిగాబోనిమ్ము తర్కాయనఁ ॥మ॥ వినితర్కుండు రథంబు తద్విధమునఁ వేవేగ బోనిచ్చి చాల్లని ఘాదోటల నారికేళ పనసాలంకార భూతోజ్వలద్వన సంఘంబులనొప్పు చోళమహిచెంతఁ నిల్పినం దరుఁ నింగని మోదించి వివేకుడిట్లనియె నాకర్ణింపు మంచుఁ మదిన్॥

శా॥ వాణీకాంచన నూపురధ్వనులతో వాదింపగా జాలు గీర్వాణాంచద్వచన స్ఫురత్సుక వితావాసాస్యులై భూమి గీర్వాణుల్ వశ్యుల జేసికొందురు పటువ్యాపారులన్ యోగులీ క్షోణిన్ నిల్చిన భోగులాదురన దర్కుండిట్లనెన్ వేడుకన్॥

వ॥ నిఖిల నిగమ హృదయాంతరంగంబును । నభంగుర ప్రసారిత భగవదను కంపాతరంగిత వివిధ వైభవంబును నగు శ్రీరంగక్షేత్రంబు గనుంగొంటివే యనిన వివేకుండిట్లనియె సంతతప్రఫుల్ల మల్లిక వాసనావిలసిత చందనాచలానిల డింభక ప్రసారశమిత సకలేంద్రియ వ్యాపారుండనై యేతద్రం

గక్షేత్రంబు గనుంగొంటి రంగనాయకాధిష్ఠిత విమల పులిన
ప్రదేశంబును యోగనిద్రా ముద్రిత భగవత్తల్ప భవదురగ
నాథసన్నిభ తరంగ విరాజమానంబును । నగుకావేరీ తరం
గిణి నేత్రపర్వంబు గావించె । గరుణామృత ప్రవాహ భరితం
బును । సంసారతాప హరంబును । దురితతూల దావాన
లంబును । విశ్వమాలిన్య విచ్ఛేదకంబునగు రంగభర్త కటా
క్షవీక్షణంబు మమ్ము రక్షింపవలయునని పరమేశ్వరు నుద్దేశిం
చి యిట్లనియె ॥మ॥ అవలోకింపరు కూరవర్తుల సమీపాసీ
నులం గోపదృష్టి వికారంబుల జిన్నబుచ్చెదరు యాచింపం
గృపాశూన్యులై । యపమానా క్షరముల్ వచింతురు ధనా
ఢ్యకులట్ తమ స్మర్తమానవ్రులంగొల్చుట మాని నీపదములా
నందంబునం గొల్చెదర౯ ౪మ। అనుచు౯ రంగ విభు న్నుతించి
పరమాహ్లాదంబుతో దర్కనిం । గనితానిట్లనియె౯ వివేకుడి
ది యోగ్యంబైన పుణ్యస్థలంబనుచున్వింటిని దీనికేమి రథమ
స్యక్షేత్రముం జేరనిమ్మనిసన్ సారథియట్లొనర్చి మృదువాక్య
స్ఫూర్తితో నిట్లనె౯ ॥గీ॥ వేడ్కతోడను జూడు వివేకయిది
నె । సకలభువన వతంసమై ప్రకటవృత్తి । మహిని భాసిల్లు
తుండీరమండలంబు । రమ్య సత్య వ్రత క్షేత్ర రాజితంబు ౪
గీ॥ సకల బుధ సేవితంబు సంసారభయవినాశకంబు పవిత్రమీ
దేశమందు । జనును నుతియింప హరినిజతనయ కృతమహాశ్వ
మేధావసరమున నవతరించె ౪సీ॥ జీవేశ్వరులకైక్య భావం
బటంచు శక్రాది దేవతలకైక్యంబటంచు । హరి హరాదులకం
టె నధికుండు గలడంచు నములు బ్రహ్మోచ్యుతేశ్వరులటంచు।
భవ కేశ వాంబుజ భవులేకమేయంచు జలజాప్తముఖ్యులీశ్వరు

లటంచు। వాదించుజడుల వాగ్వ్యాపారముల నాదరింపకవే
దాంతరీతిదనరు । బాదరాయణు ఘనవాక్య పద్ధతులను। ము
క్తభోగ్యుండు హరిమాకు ముఖ్యదైవ।మనుచు విహరింతు రి
చ్చటిజనులు వీరి।కరయ నాజన్మసిద్ధమీ సరణియనఘ ॥

క॥ మునిజనవినుతుడు భూసుర।డనఘుండు పవిత్రుడా హి
తాగ్ని యొకడు పా।వనవర్తనుడై యీస్థల।మున విహరించును
సుకర్మముల మూలంబై ॥క॥ న్యాయంబులైన కర్మో।పాయం
బులు విడువరాదు ప్రాజ్ఞులకు రఘూ।నాయక పద సేవాది।ప్రా
యశ్చిత్తముల దెగవె పాపంబులనన్ ॥వ॥ అనిన వివేకుండి
ట్లనియె ॥చ॥ ద్విరద నగేంద్ర కూటమొక వేశ్మముగా దన
రారుచున్ విధి।స్ఫురిత తురంగమేధ కృతశుద్ధ వితర్దిక యం
దుబుట్టి భా।సురగతి హవ్యముల్ గొనిన సుందరమూర్తి ము
కుందు డిందిరా।వరుడు మదీప్సితంబు లనివార్యగతిన్ దయసే
యుగావుతన్ ॥చ॥ భవతటినీ సముద్ధరణ పాటవసంయుత
దేశికోక్తి వై।భవమున నన్యకర్మముల పద్ధతిబాసి దయాన్వి
తుండనై। భవదమలాంఘ్రియందు సమభావముగైకొని తత్వ
దృష్టి మా।ధవ హరిమద్భరంబిడి ముదంబున నిర్భయవృత్తి
బూనితిన్ ॥వ॥ అని విష్ణుదేవునకు నమస్కరించి వివేకుండు
తర్కునితోనిట్లనియె నీ దివ్యక్షేత్రంబు దృక్పర్వంబు గావిం
చె వేంకటాచలంబునకు రథంబునడుపుమనిన నతండట్లుకావిం
చి వివేకునితో నిట్లనియె దేవా పరాపరతత్వజ్ఞ పరివృతంబై
పరంపదంబునుంబోలె భాసిల్లుచు ననేకదేశ దర్శన ప్రయా
స పరిశ్రాంతులమగు నుభయులకును విశ్రాంతి భూమిచందం
బునం గనుపట్టుచు। సమున్నత స్వర్ణకూటంబుల నలరారు

చు । నిజప్రభాపటల పరిహృత దశ దిశాంధకారంబును నగు
చు గలికల్పిత సకలదురిత ప్రశమనంబునగుచు వేంకటాచలం
బుసమీపంబునంగనుపట్టుననిమరియునిట్లనియె॥ఉ॥ ఈనగకూ
టసీమలరమేశ్వరపాద సముద్భవాపగా । మానితనిర్ఝరోది
తసమగ్రవనస్థలులన్వసింపుచున్ । జ్ఞానము భక్తియున్ గలిగి
శౌరిపదంబులు సజ్జనుల్ మదిన్ । ధ్యానము సేయుచుందురు
మహాత్ము పరస్పర వైరహీనులై ॥ఉ॥ కొందరుమానులీ శి
ఖరికూటములన్నగవ తత్కృపాజగ । ద్వందిత సర్వపాపవనదా
వ కృశాను శిఖాపరంపరా । నందవిధాయినీ మృదు మనస్విని
పోషిత సర్వదేవతా । బృందయటంచు దత్కృపను ప్రేమనుతింతురు
మోక్షకాములై ॥ మ ॥ భగవత్పూర్ణకృపా ఝ
రీగుహా రుమాప్రాణేశ కుబ్జా కుచే। లగజేంద్ర వ్రజకామినీ
ద్రుపద హల్యామాల్య కృత్కాళియో । రగకాంతా శబరీ
వినిమ్నతలు సర్వజ్ఞోన్నతుల్ తుల్యమై । దగనీశక్తినటంచు
గొందఱు మదిన్ ధ్యానింతురే తత్కృపన్ ॥ శా॥ శ్రీరంగం
బు వృషాద్రి దంతిగిరి కాశీ ముఖ్య దివ్యస్థలుల్ । శ్రీరంజిల్ల
గ నీవు సూచితివి ధాత్రిన్ వీనిలోనంగలి । క్రూరాఘౌఘ ని
వారకంబును ముముక్షుస్థాన యోగ్యంబనం । గారాజిల్లెడు
దివ్యభూమి కడువేడ్కన్ నిల్వరాదాయనన్ ॥ వ॥ అనిన వి
వేకుండు తర్కునితో నిట్లనియె । జితేంద్రియుండగు వాడెచ్చ
ట వసియించిన దత్తద్భూములెల్లను గయా ప్రయాగ కురు
క్షేత్రంబులకంటె నుత్తమంబులని పండితులానతిత్తురు। సక
ల పుణ్యక్షేత్రంబులు కలియుగ బలంబున మోహాక్రాంతంబు
లై యున్నయవి సమాధి ప్రకారంబెచ్చోటనైనను నిర్విఘ్నం

బుగా జరుగునని తోఁచదైనను గృతయుగక్రియా యోగ్యం బును శాప రహితంబును నగు పుణ్యక్షేత్రంబు శోధింప వల యు శ్రేయస్కరంబులగు కార్యంబుల కనేక విఘ్నంబులు సంభవించు నారాయణధ్యాన పరాయణుండై పరిత్యక్త తది తర వ్యాపారుండగు మహాత్ముని చెంతను విఘ్నంబు లరుగవు. భగవత్ప్రపన్నుండగు వాడు మాయం జయించునని వేదాం తంబులయందు జెప్పంబడు పురాణ కల్పిత పరివృతంబులును బాహ్యస్థంబులును। వివిధ విఘ్న సమాక్రాంతంబులు ను। నగు దేవతా స్థలంబుల నిర్విఘ్నంబుగా సమాధి జరగ ద ల్లాట నిర్దోషంబును। సుగుణ భూయిష్ఠంబును। నగుహృ దయ పుండరీకంబు సమాధి స్థానంబుగా నిర్ణయించితి। సం గాంగీ భావంబున పృథగ్భావంబులేని ప్రపన్న జీవేశ్వరులకు నివాసస్థానంబు మనఃకమలంబని నింటిసని మఱియు నిట్లని రు ॥మ॥ విమలాచార తపోవనైక నియతుల్ విజ్ఞాన శైలా శ్రయుల్। కమలాకాంత పదస్పృహామర నదీ కల్లోల కేళిప్రి యుల్। రమణీయాత్మ విచార నిర్దళిత దుర్వారాఘులై నట్టి సంయము లెచ్చోటికి నైననేగరు ఫలంబాసింప నెల్లప్పుడున్

శా॥ గంగా సేతు సరస్వతీ దివస కృత్కన్యాక వేరాత్మ జా। తుంగాగౌతమ పుత్రికాది నదులందుం మజ్జనంబాడునా। మాంగళ్యాన్వితమైన బ్రహ్మను మనోమార్గంబునం జూచు ని స్సంగుండేగునె ఘర్మపీడితుడు కాసారేతరక్షోణికిన్ ౪గీ॥ పురు షునకు ధారణాది నైఖరులనంతరాయముగ జెల్లుచుండంత రంగమందు। ననుచువేటకా వివేకుడయ్యవసరమున! సారథి సమేతుడగుచు నిష్క్రాంతుడయ్యె ॥శా॥ కోటీరస్ఫురితోత్త

ఖాంగ కరుణాంకూరాంచితాసంగ చ। క్రాటోపత్ర్యాచితా
హితాంగ సుభగత్వానంగ బాణాసన। జ్యాటంకారపలాయి
తారి చతురంగా పాపభంగామహా। ఘోంటీభూతవిహంగ స్వీ
కృతరమాఽఽఖుద్రాంత రంగాంబుజా ॥౮॥ పారా వారా గా
రా। నారాచార ప్రదళిత నానాదైత్య। కూర్రాకారా ధీరా
శ్రీ రామా రాధితాతి శృంగారహారీ ॥మాలిని॥ కలశ జలధి
కన్యా కౌస్తుభోపేతవక్షా। బలరిపుముఖదేవ ప్రార్థితాం
చత్కటాక్షా। సలలిత నిగమాంతా చారసంయుక్తవక్షా। వి
లసిత జలజాక్షా విశ్వకర్తృత్వదక్షా॥ గద్య॥ ఇది శ్రీవే
ణుగోపాల కరుణాకటాక్ష వీక్షణ పరిలబ్ధ సకల సామ్రాజ్య
విరాజమాన రావువంశ కలశ పారావార పరిపూర్ణ చంద్ర
సమాన నిఖిలశాస్త్ర వాసనా సముదిత విజ్ఞాన శ్రీమన్మహా
రాజరాజశ్రీ వేంకటరంగారాయ నరేంద్ర పుత్ర రాయరా
హుద్వేశ్యా భుజంగ సర్వజ్ఞాది మహా బిరుదాభేయ సమరవి
దళితా మిత్రరాజాధి రాజ మహారాజ రాజ తేజోనిధి మహా
రాజశ్రీ రాయడప్ప రంగారాయ నామధేయ ప్రణీతంబై
న సంకల్పసూర్యోదయంబను వేదాంత నాటకంబునందు స్థాన
విశేష సంగ్రహంబను షష్ఠాశ్వాసము॥

# సంకల్ప సూర్యోదయము.

శ్రీకాంత మునిమనోనా । ళీకోరు నిశాంతకీర్తిలీలాక్రాం
తా । నేకదిగంతవిలాసవ । శాకులిత మనోజవిధుజయంత వసం
తా ౪వ॥ అవధరింపుము । కవి క్రీడిన్సంసారాఖ్యం। దాత
ర్వ్యాతను నిజాప్తులం దారగదా । నేతెంచి యనుభవుసకుఱ।
నేతనయుడ దర్శ్వవేకునికి శిల్పినకుఱ ॥గీ॥ విబుధశిల్పియైన వి
శ్వకర్మనైపుణ్య । శిల్పిరాజవాయుని శిల్పవిద్య । నోటుపరచి
పెక్కుపూలబుసిర్వంపు । మండమోహుడాత్మ నుత్సహించి॥
వ॥ తత్సమయంబున మేఘశ్వైటభ సన్నిభులగు రజస్తమో
గుణంబుల బరిపుం నాక్రమింపుఁడని పేరిణేపణగావింప నట్లు
గావించిరి పురుషుల ప్రబుద్ధులగుట రజస్తమంబుల చేత జ
యింపఁబడిక తత్సమయంబున బరమపురుష దయాచోదిత
యగు వివేకశక్తికి బరిచారికలగు దృష్టి సదృశ దృష్టుల చేత
నేను ప్రబోధితుండనై తత్ప్రతిపక్షుల బారందోలితి దదనంత
రంబా విశ్వ చిత్రదర్శనోత్సుకుండగు వివేకుండు నిజసేనానియు
గు వ్యవసాయునిచేత శుద్ధాశుద్ధ విభాగావహంబగు విశ్వప్ర
కారంబు చిత్రింబున లిఖయింపవలయునని తెలియంబడజే
యించె దత్ప్రకారంబున గర్మయోనులగు దేవాదుల యప
రిశుద్ధ రూపంబులును బరమాత్మ పరిశుద్ధ రూపంబును లిఖి
యించితి । నేతచ్చిత్రంబు సూక్ష్మస్థానంబై సాంద్రిలగ్న వితే
పంబై స్నిగ్ధ వర్ణంబై స్వల్పరేఖా విరాజితంబై మదీయాం
తరంగంబలరింపుచున్నయది యనేక సహస్రి చిత్రంబులేను

లిఖించితిగాని దీనిచందంబునసపి యుండవు। శిల్పవిద్యాఫలం
బే చిత్రలేఖనంబువలన బరిపక్వంబయ్యె నని తలంచెద నాలే
ఖనియంబులను భగవదవతారంబుల కృపాకటాక్షంబులవ
లన శిల్పవ్యాపారంబులు సులభంబులయ్యె నేతక్వాశ్చర్యచిత్రం
బువీక్షించి వివేకుండానందించునని తోచుగాని రాజులునిరం
కుశలట్లగుట। నొకానొక కార్యంబునందు విపరీతపరివర్తనం
బు గావింతురు వివేకుండతి శోభనంబుగావున దననుగ్రహం
బున కేనుబాత్రుండనగుదు విశ్వకర్మను స్మిస్త ఫుట్టించుజాలు
మదీయ శిల్పకర్మంబులవలన మాకుఫుండరీక నమాంసీనుండ
గు పరమాత్మకు రత్నమంటపంబు గావించితి దదీయ మణి
స్తంభ దీప్తులు సోపాన గోపానసీ గవాక్షవితానాదిమార్గం
బుల బరిణమింపుచున్నయవి యనుచు వదించు సహాయుంబు
న వివేకుండు వ్యవసాయ దత్తహస్తుండై సుమతి సేవింప
శిల్పశాల కేతెంచుచున్నట్టు గానంబడిన సంతోషయుండు ని
ప్రాకారంతుండయ్యె దదనంతరంబ సర్వాశ్చర్య సముచ్చ
యాలోకన కుతూహలాహుతాంత పురందర పురంధ్రీ పరిష్కృ
తగృహోపాంత ప్రదేశంబును బహిరంతః ప్రకటిత మందా
ర పుష్పవాసనా పూరితంబును బరిస్ఫుట ప్రకటిత భిత్తి భాగం
బును నగు సంస్కార కల్పిత మంటపంబునందు సుమతి సమే
తుండై వ్యవసాయ దత్తహస్తుండగుచు వివేకుండు ప్రవేశిం
చి యిట్లనియె ౹చ౹ పరిచయశక్తియుక్తుడయి పాకభిదాది
సురలి నుతింపగా। సురుచిర వృత్తినిల్పి పరిపస్ఫగతిఃపఖ
యించె జింతనా। నిరుపమభిత్తియందు రమణీయమపిం ప్రబ
లప్రపంచమై। ఖరులు సపీసనంపప నగంబు వహింపినకళి బో

పగఁగ్॥ కల్పితములైన నేమియకల్పితముల। రీతినీభిత్తిచి
త్రముల్ భూతవర్త। మానగతులభవిష్యద్విధానములను। వి
రళముగ జేయుచున్న విశ్వేశమహహ॥ గి॥ తనుతఋనియు న
పరిమితప్రపంచ। గుణములు వహించె నీచిత్ర కుడ్యమహహ।
దీనికిదియె గణింప సమానమనగ । జనదు పైనొక వటపత్ర
శాయిగలడు॥గి॥ భువనములు గర్భమందున బూని బాలు
డగుచు క్రీడింపడే యశోదాత్మజుండు। పరిమితముకాని విశ్వ
వైభవము చిత్రభిత్తి పరిమితమయ్యు జూపించుటరుదే ॥

ఉ॥ తూలికబట్టి వర్ణములతో రచియించిన యట్టి చిత్ర
ముల్ । చాలవు దీనితో నెపుడు సాటివహింపగ మాధవార్చ
నా । తూలికబట్టి భావనలతో రచియించె మదీయ శిల్పినీపి
లిఖితంబు జూడగదవేయని పత్నికి జూపె వేడుకన్ ॥గి॥ సుమ
తితచ్చిత్ర లిఖితంబు జూచి మదిని । సంతసము జెంది విభుని
యాస్యంబుచూచి । యనఘుడైనట్టి సంస్కారు డాచరించి।న
ట్టికార్యంబు మెచ్చరె యమరులైన ॥క॥ హరి యొక్కడు
నీవొక్కడ ।వరయన్ సంకల్పసిద్ధులన్నాట భవాత్కారణా సం
స్కారుండీ। తెరువున జిత్రరచవారిసె దివిజులు మెచ్చన్ ॥

చ॥ అనిన వివేకుడిట్లనియె సంగనతో భగవత్ప్రియాంఘ్రి వై
మనుజుల కాశ్రియం॥ యి సమస్తమలీమసృష్టిరూపమైన త
నరెడు చిత్రభిత్తిక విధానము తావక లోచనోత్సవం। బనవ
రతంబు జేయును గదాతరళీ కృతచారు లోచనా ॥చ॥ సక
లగుణాభిరాముడగు చక్రధరుణ మదిజూడ గోరువా।నికి దొర
వట్టినట్టి రమణీయ దుకూలమురీతినొప్పెబా।లిక గుణరూప
చిత్రితబలిష్ఠులు దీనిబరిత్యజించి ము।క్తికి జను త్రోవ జూపెద

ర కిల్బిషవృత్తి వహించి నిత్యముౕ ॥౪॥ ఏతదురుచిత్రభిత్తిక
నిం మువదన। నీవు వీక్షింపవలదని నేర్పుతో వి।వేకుడాసతి యి
చ్చిన విని ప్రమోద।మలర వ్యవసాయుడిట్లనె నతనితోడ ॥
వ॥ వివిధ విషయ వ్యాపారోపాంత రోపాలస చిత్తులును।
నన్యోన్యవిరోధవిచారాభిలాషులును।గమతమః రప్రాయులు
నగు బుద్ధిహీనులకు సంసార సముద్రంబాశ్రయంబై యుండు।
బుద్ధిసంపన్నులగు మహాత్ములు తత్సముద్రస్థితి బరిత్యజింతుర
నిన సుమతి వివేకునితో । భవదాజ్ఞా ప్రకారంబున నపరిశు
ద్ధంబగు విశ్వంబు నిరీక్షింపనని వ్యవసాయుండు క్రమ్మరనిట్ల
నియె । నిటమీాదట బరిశుద్ధసృష్టి మయంబగు భగవద్విభూ
తి భాగంబు మీారిరువురు నిరీక్షింపవలయునని మరియునిట్ల
నియె ౪ వ ॥ పరమ వ్యూహములై తదంతరములై భాసిల్లు
లక్ష్మీమనో । హరు రూపంబులయందు మీామనసుదీప్యద్వ్రృ
త్తి బోకున్న ని।ర్జర తిర్యఙ్నర వేషధారియయి వైజాత్యంబు
లేనట్టి వై।ఖరివర్తించు మురారి రూపముల వేట్కన్నిల్పుడీ
మీామదిౕ ౪౯౪ అనిన వివేకుడు సుమతిం।గని యిట్లనె సైన్య
నాయక వ్యాహృతులెల్లను సముచితగతి దనరును। మును
కొని తత్ప్రకారములు వివరింతుౕ ॥సీ॥ అతిపపరంబువ్యూ
హములు వ్యూహాంతరంబులు జూచినట్టి వారిలనులేరు। నంద
జోపేంద్ర మీానప్రముఖావతారముల సాదృశ్య రూపములు
మదికి। దెల్లంబులగుట దద్విభవంబు లెల్లన యత్నలబ్ధము
లగు నాత్మకెపుడు। ధ్యానంబుగావించు మానులకెల్లను సు
లభముల్ విభవాకృతులు గణింప। మాముకావతార మర్గం
బుతెలిగిన। మానవులకు జన్మమరణ భయము। బాయద్రోచ్చి

ముక్తిపద్ధతి నిలుపుదు । ననుచు విష్ణుదేవుడానతిచ్చె ॥వ॥ ఆ
నిన దద్వచనంబులు విని వ్యవసాయుండిట్లనియె ॥గీ॥ వీక్షణా
ధ్యాన సంస్పర్శ విధులశౌరి । భువనములనెల్ల బోషించుభూ
రిమహిమ । మీన కూర్మ విహంగముల్ పూనియాత్మ । సం
తతులనెల్ల బోషించు చందమునను ॥వ॥ అనఘుడు పద్మనా
భ్యుడు డనంతుడవిశ్వర్యుడైన శౌరి పావనగతి దివ్యాకృతు
లవారణావృత్తి వహించి కచ్ఛపంబున విహంగంబున జలచరా
ఖ్య మనగ వనసూకరంబునం । దనరుచు బ్రాకృతాకృతివిధం
బు వహింపడు చిత్రమిద్ధరన్ ॥చ॥ అనిన వివేకుడిట్లనియె సం
గనతోడ నశేషసజ్జనా వననిరతుండు భక్తజన వత్సలుడా
తత శరణ్యు డాజనార్దనుడు కృపాంబురాశి యవతారము
లెత్తుట మోహవార్ధిలో । మునుగు ముముక్షులన్వడి సము
ద్ధరణం బొనరింపగాజుమీ ॥చ॥ అనఘు జనాఘతూలదహ
నాకృతి సర్వజనస్తుత ప్రవర్తనమగు విష్ణుదేవుని నితాంతస
మర్థత మోహముఖ్య దుర్జన పరివేష్టితంబగు ధరాస్థలి
యందు వసించు మర్త్యులన్ । మునులు నుతింప దక్షణాన
ముక్తులజేయుజుమీ తలోదరీ ॥క॥ జగములు రక్షించుటకై
భగవంతుండవతరించు బహురూపములన్ । మగువా తద్రూ
పము । లగణితములు బ్రహ్మకైన హరునకునైనన్ ॥వ॥ వినయ
మునంజమూహతి వివేకునితో నపుడిట్లనెన్ మాయుం । ఘను నిధి
విశ్వకర్మయు ననానగతిన్ రచియింప నేర్చునే । నానాభ
వాండచిత్రము ధ్రువంబుగ శ్రీరమణీ మనోహరుండు । సకలము
లై రచించెను జరాచరభేద సమన్వితంబుగన్ ॥వ॥ నాకగర్
మూడవతారముల్ ప్రౌఢమె తేపగ వానినీ నాద్యలై । తిన

కన్ మీనము తుంగభంగ రచితోద్యత్కల్లోలలం బాగుచున్ ।
వనముగ్నాగమ మార్గణాస్ఫురిత భాస్వద్వేత్రుణాబ్జంబు లో
య్యన దక్షిణము నింపెదజ్జలధి గర్భాంభః ప్రవాహంబులన్ ॥
క॥ అనిన వివేకుడు సుమతిం గని యిట్లనె చూడుచూడు కలి
కిభవల్లోచన సదృశమైన భగవద్ఘన మీనాకారమనిన గా
మినివేటుకఁ బవు కనుంగొని సంతసిల్లి విభునితో సునుతి
యిట్లనియె ॥ చ॥ జలధినిమగ్న వేదములు సయ్యన దెచ్చిన భూ
న రూపముగ । దలచుటకంటె మోహన ముద్ర పయోధి
మునింగినట్టి ప్రాబలుకుల నుద్ధరించిన శుభప్రదమూర్తిఁ స
రాకృతిన్ నినుం గొలుచుట యోగిపుంగవులకుఁ సులభంబని
తోచు నెమ్మదిఁ ॥ గీ॥ పరమపురుషున కిట్టిరూపము లనేకము
లు మహింగలవంచు ముముక్షులందు ప్రకృతి దెలుపనె యు
నిన సేనాధినాథుఁ డవ్వధూటినిజూచి యిట్లనుచు బలికె ॥
గీ॥ అమృత కమలా సుధాంశు జన్మములకాది । కారణం
బైన కమఠావతారమబ్ధి । సంచరింపుచునున్నది జలజనయన
కన్నులనుజూచి మ్రొక్కుము కరములెత్తి ॥ మ॥ కమఠాకా
రము బూనిమందరకు భృత్కుండూయనోద్భూతసౌ । ఖ్యము
నన్ నిద్రితుఁడై స్వనిశ్వాసన వాతాందోళితాంభోధి భంగము
హాతల్పముగ రమారమణి వేట్కఁ గొల్వ గా బ్రహ్మకల్పము
లుద్యద్గతి బుచ్చుమాధవుని రూపంబింతి వీక్షింపుమా ॥
క॥ అనినవివేకుడు సుమతిం గనియిట్లనె బ్రహ్మతోడఁ గనుల
జనీసం జననమునకు హేతువునే । ననుచుఁ వాదించినట్టియాత
డితడెనుమీ ॥ క॥ అనిన వివేకునితోనిట్లనె సుమతి రమాన్వ
యంపరాహణంబగువి । ష్ణుని సుకుమార శరీరంబునకీ కాఠిన్య

లకొడిస్సనియె నంబుధి కన్యకమావహాటికో। భవత్కాసిమభా
గణావి కృపారసరాజ దపాంగలోకనా। దనిసకలాగమాంత
గణవర్ణిత పాదసరోజ వేల్కుతో। దనయునిదల్లి పోచినవి
ధంబులరగ నసుబోధిదుగావృతగ॥ చ॥ అమరవధూ శిరోజ
కుసుమార్చితనై నిరుపద్ర వాందితో। త్వముభవప్రదంబ
ఋ పదంపడిభాసిలు నీపదారవిం। దముభజయింతునీవ్వృదువ
డంబున కేమనుతెల్ల మొక్కిమో। కుమునకెబోదునంచు న
నకప్రముఖుల్ వచియింతురెందిరా౪ వ॥ అనిలక్ష్మీప్రార్థనం
బుగావించి వివేకుండు సుమతితో నిట్లనియె విష్ణువల్లభయ
గుకుమారమణిని సేవించు సజ్జనులు సంసార సముద్రంబు దరిం
చి పునరావృత్తి రహితంబగు విష్ణులోకంబున వసియింతురు
నీవు సాగరకుమారికాంశ సంభవవని తోచుచున్నయది సౌం
దర్యసౌకుమార్య సౌశీల్యాది మంగళ గుణపరంపరలు నీయందే
నంబున్నైయున్నయవి యనిన సుమతి వివేకునితో నిట్లనియె దే
వాలక్ష్మీసాన్యంబు నాయందు సంస్థాపించుట విష్ణుత్వంబు నీ
యందునసిద్ధంబై యుండుట ప్రకటంబయ్యెననిన వ్యవసాయుండి
ట్లనియె దేవి పురుషాకారంబులెల్ల విష్ణుస్వరూపంబులనియు వ
నితాకారంబులెల్ల లక్ష్మీ స్వరూపంబులనియును పౌరాణికులు
వచింతురు కల్లాట బురుషోత్తముండగు నీవివేకుండు విష్ణుండ
గుటకు సంశయంబు లేదు పతివ్రతా శిరోమణి వైన నీవు
లక్ష్మీ దేవి వగుటకు సందేహంబు లేదనిన వివేకుండిట్లనియె
స్త్రీ పురుషాకారంబైన ప్రపంచంబు నిజేచ్ఛం గల్పించు
పురాణదంపతులకు లక్ష్మీనారాయణులకు నమస్కరిం
చెదనని వేరొక్క పరమేశ్వర రూపంబు జూచుటకు నిచ్ఛ

యించిన వ్యవసాయుండలని కీర్తనీయుఁడు ॥ మ॥ ప్రళయాంభోనిధి
మగ్నమైన ధరణీభాగంబు దంష్ట్రాగ్రమం దలఘుస్ఫూర్తిని
నిల్పి యొప్పెడు వరాహాకారమై వేట్కఁ జెన్నలరన్ భాసిలుచుండు
నిద్ధరదదీయస్థూల దంష్ట్రాగ్రమం దలరుఁ గేళివిలగ్నమం తి
ల వ్యాపారముం బూనుచున్ ॥ చ॥ అని వ్యవసాయుఁ డుజ్జ్వల
మహాకిటిరూపము జూపినన్ ముదంబునన వివేకుఁడాకిటికి
మొక్కినమున్నెవ వారిధారక! గ్గోసలను జాఁగ మెయిఁగను
ర్పొడవన్ గరముల్ మొగిడ్చి సజ్జనులలరన్ నుతించె వ్యవ
సాయుఁడు నెచ్చ సనేకభంగులన్ ॥ క॥ ఖురదష్ట్రమైన విల
య! ఖ్ఖరదర్భిన్ మునిగినట్టిభూమిని సురల! ద్ధరణంబు జేసితిమి ము
రహర ముస్తంబోలె సూకరాకారమునన్ ॥ చ॥ మునిజనపూ
జ్యజృంభిత సముద్రవిహార సమర్థ భూతలావన నిపుణోగ్ర
దంష్ట్రి బుధవత్సల దైత్య భయంకరాకృతీ! సనకసనందనాది
మునిసన్నుత చిత్రచరిత్రవైభవం! దనమొనరింతు నన్ను సతతం
బు కృపం గనుఁగొమ్ము ప్రీతితో ॥ మ॥ విలయాంభోనిధి వీచి
కాసమరవాస్ఫోటోరు ఘోణంబు కేసలదంష్ట్రాగ్రవిరాజ
మాన వసుధాభ్యాసార మాదిత్య మండలసంస్తుత్యము శాం
బరకిటిపరివారత్వంబు దీపించ మంజులవృత్తిన్ నము బ్రోచు గా
త దురితస్తోమంబు మాన్పుచున్ ॥ చ॥ తొలుత వరాహరూ
పుఁడగు తోయజనాభునిచేత భోగభగ్నిలయమునన్ సము
ద్ధృతమై నిక్షితమైన మహీపురంధ్రికిం బ్రియ పయోనిధి
ధ్వనులు భాసురమంగళ వాద్యనాదముం దలతనహించె వే
డుకనుజూడఁగ దే సరసీరుహాసనా ॥ చ॥ గరుడతురంగుఁడంబు
నిధి కన్య నురస్థలమందు బూనుచు! ఖరిభుజగాధినాయకుఁడ

ఖండతర ప్రతిపన్న భోగుడై। శిరముల మేదినీసతినిశ్రమముగా వహియించె నైటభాసురహారుడైన విష్ణునఖసుందరి శయ్యా సుమీ యతండిలన్ ॥వ॥ అనిన సుమతి వివేకునితో నిట్లని యె ॥ఉ॥ ఆదివరాహమూర్తి ప్రళయాంబుధిలోన మునింగి నట్టియీ। మేదిని సశ్రమంబునను మీదికినెత్తినరీతి నీవుమో హాదిక దుఃఖభీకరమహాంబుధిలోన మునుంగు జీవునిన్। మోదముతోడమీదికి సముద్ధరణంబొనరించు వేల్పుడిన్॥ వ॥ దృఢతర దంష్ట్రాగ్ర విదారిత హిరణ్యాక్ష వక్షస్థలని గళిత రక్తప్రవాహ పాటలీకృత సముద్రోదకుండగు యజ్ఞవరాహ మూర్తి యొనర్చిన రణంబు చందంబున మహా మోహునితో నీవు రణంబొనర్చి విజయంబు గైకొనుట వీక్షింపవలయునని తలంచెదననిన వ్యవసాయుండిట్లనియె దేవ నీవు సంకల్పించిన ప్రయోజనంబు రయంబున సిద్ధింపంగలద నిన వివేకుండు వ్యవసాయుంగనుంగొని పరమపురుషునిదివ్య నరసింహరూపంబు జూపుమనిన వ్యవసాయుండు వివేకునితో నిట్లనియె ॥క॥ కనకాక్షుండగు దైత్యావ। కనుజన్ముండైన దానవాధీశ్వరుడా। కనకకశిపుండు హతుడగు। య్యెనుపరహరిరూపుడగు రమేశునిచేతన్ ॥మ॥ విలయాగ్ని ప్రతిమాన భీకరతపోవిద్యావిశేషంబునన్। జలజాప్తప్రముదముందజేసి వరముల్ సంప్రాప్తిగాజెంది నిశ్చలుడై లోకములెల్ల నేలు దనుజస్వామిన్ప్ర లోకించి కేవలభీతిన్ భజియించు దన్తితిసుతున్ వారిశుడెల్లప్పుడున్ ॥మ॥ వచనాగోచరకీర్తిభాసురుడు దుర్వారప్రతాపప్రభా। విచలన్నిర్జరనాథ సైన్యుడు జగద్విఖ్యాతుడైనట్టి రాత్రిచరశ్రేష్ఠుని పాదపీఠమున దైత్యేశుం మరగాన్

మణుల్ । పరిచరాత్రీయ కిరీటముల్ బోరలగా బార్ధిఁ దేలు
కొల్లప్పుడుఁ ॥ గీ॥ ఈహిరణ్యకశిపుఁ డామాటిభక్తుఁడై । నట్టి సుతు
ని కష్టపెట్టఁదలఁచి । హరివసించునెచట ననిన ప్రహ్లాదుఁడం । లెట
ను గలఁడు శౌరి ధన్యుయనియె ॥ ఉ॥ పుత్రునితో హిరణ్య
కశిపుండు రమారమణీ ధవుండు సర్వత్ర వసించునంచు జేలు
వంబుగ బల్కెదవా ముకుందుఁడీ । చిత్రపుఁ గంబమందున వసిం
పఁడో యని కేలుజాపగా । శాత్రవు లుల్కఁ దోఁచె వడి శౌరి
నృసింహ శరీరధారియై ॥ చ॥ ఖరుపసటా పరిభ్రమణ పాటవ
కంపితలోకుఁడైన శ్రీనరహరి నైలవతు హారణంబొనరించిన
వజ్రధారకుఁ । వెంవనియా సుపర్వరిపుఁ డీరుని భార్గవ దురక్షనలం
బు నిర్జరులు నుతింపఁ జించె నఖప్రకర ప్రబలాసి ధారలన్
చ॥ అనిన వివేకు డిట్లనియె నద్భుతముల్ నృహరి ప్రభావ
ముల్ । ఘనతరదారు సంతతిశిఖావర్గమై నరసింహ చేత నం
దనవటీనైయె పితామహ పితామహుఁడైదగు వైదికంబవింపున
ముముబ్రోచుగా తదనపత్రుని నంబిక ప్రోచునైనఁ ॥ మ॥
పవిధారాతి శయనస్ఫురన్నఖ శిఖాభగ్న సురోరక్షనలీ ప్ర
వదుద్యద్రుధిర ప్రవాహపిల సస్సంధ్యా రుచి చ్ఛన్న దిగ్వనం
దింద్ర విరోధి వైన్యలేమిరాజ తారక భాస్వత్కరుండవ న్భా
సిలు శ్రీనృసింహుండు కరంగాంక్షాకృతిం జూడగన్ । చ॥ పరు
షనఖాగ్ర వజ్ర బలభగ్న హిరణ్యసమూర్ఖ్య దానవోదర గళి
త రురక్తజనిత ప్రబలాద్భుత సాంధ్యరాగముల్ । కరకర
సన్నిభంబుల నఘుంబుల దివ్రజ భంజనంబులై । పరగు నృసింహ
మూర్తిఁ పటుబాహువులాతనివల బ్రోచుఁగావుతన్ ॥ వ॥ ఆ
నినవివేకునితో వ్యసనాయుం డిట్లనియె నీవు భక్తిపూర్వకంబు

గానిప్పుడు నృసింహదేవునినుతియించినశ్లోకాష్టక వరంపరల
స్పష్టదభినుతార్థ ప్రకరంబులును సుందరపద బంధురంబులు
ను స్వయంవ్యక్త వచన సన్నిభంబులును నిఖిలభవభయ సం
హారకంబులును నగుచు దనరు చున్నవని మఱియు నిట్లని
యె॥ మ॥ ప్రణతాపన్న మనోరథప్రదములై ప్రహ్లాద సద్భ
క్తి రక్షణ దీక్షాచతురంబులై ప్రళయమేఘస్థూల నాదంబు
లై రణరంగాగతవైరి భీకరములై రాజిల్లు రాత్రించరాగ్ర
ణీ సంహర్తృ మహాట్టహాసములు నిర్వాణప్రదంబుల్ సుమీ
మ॥ అమరజ్యేష్ఠసునికి హిరణ్యకశిపూద్యన్మంటపస్తంభ
ము౯స్తమవృత్తిన్ జనకాంబనై తనర దత్స్తంభంబునం బుట్టి చ
క్రముఖాస్త్రాయుధముల్ గృశింపగ నఖాగ్రశ్రేణి దద్దైత్యు వ
క్షము భేదించిన శ్రీ నృసింహుడు స్వభక్తశ్రేణులం బ్రోవు
త౯ ॥చ॥ అనిన వివేకునింగని తదంగనయిట్లనియె౯ నృసిం
హుడా దనుజకులాగ్రగణ్యుని మహింబణగించినరీతి మోహము
నిం దునుముమటంచు బల్కిన ప్రబోధముతో వ్యవసాయు
డా వివేకున కత్త్రివిక్రమమూర్తి ఘనఘను డైన మహన్నైరిని జూపి
జూపినన్ ॥క॥ ఘనుడు వివేకుండా వామనమూర్తిని జూచి
మ్రొక్కి మహానియగతి౯ వినుతించి తచ్చరిత్రము లనఘ
గతిం బొగడదలచి యుడ్డిల్లనియె౯ ॥శా॥ పీడాస్వాతవిరో
చనాత్మజ యశశ్శ్రీవర్ధకంబై నభశ్చ్యుతోదార శిరోవ
తంసము ఋ రక్షోభీకరంబై జగత్పీడానాశకమై సుపర్వతటి
నీ తీవ్రప్రవాహోత్కట క్రీడాకారణమై చెలంగు భవదంఘ్రిం
గొల్చెద న్వామనా ॥చ॥ అనిన వివేకునింగని తదంగనయిట్ల
నె బాలినాథ వామనుడు విరోధులంగెలిచి మానులు మెచ్చ

నఖాగ్రశక్తిచే ననిమిషవాహినిం బ్రబలమై చరియింపగజే
యు రీతి మోహాంబుని దనుచూడికి కాని సమున్నతి బొందగ
జేయు పీవొగి ॥వ॥ తదనంతరంబ వ్యవసాయుండు వివేకు
నిం గనుంగొని యిల్లనియె భృగు రఘు యదువంశ సంభవు
లై దుష్టజన సంహారకులై శిష్టసంరక్షకులై చెలంగుదురీము
వ్వురు రామాభిధానులలో బహుముఖ్య పుణ్యజన సంహార
కుండయ్యు మధ్యము రాముడనేక పుణ్యజనోద్ధారకుండయ్యె
నిమ్మహానుభావుండు కౌసల్యాగర్భ సంజనితుండై కంచుకిత ప
రాత్పరభావుండై నరరూపంబున విహరించు ॥సీ॥ శైశవంబు
న మునిజన్నంబు రక్షించె బహువిద్యబాణ సంపద వహించె।
బలిసంఘమైన సుబాహుముఖ్య సురారాతులను వేట్కగి
టణంచె। రాజితమిథిలాపుర స్త్రీ విలోచన కువలయంబులను
నుత్సవమొసంగె। మిత్రవంశంబు పవిత్రింబుగావించె గాల
కంఠుని కార్ముకంబు నిరిచె, జానకిని బెండ్లియాడెను జానదగ్ని
బలిమి గట్టిన స్వర్గసోపానములను। హానిగావించె దండిరివా
క్యమునకై స్రుత। సానేరా కండవిడిచె రాజ్యంబు మహిని ॥
సీ॥ దండకాటవిని సముత్పన్న సదయంబులను బంగారూపు
రమహీజాతమయ్యె। ఖరదూషణాది రక్షస మహీజములకు
దుస్సహచండ వాతూలమయ్యె। సమరదర్శన సముత్పన్నయుక్త
మైథిలీ పరిరంభణమునకు బాత్రుడయ్యె। మారీచునకు పితామా
దూషరంపరాలంభనమునకు గుంభియయ్యె। మహిజటా
యువునకు మోక్షమహిమ నొసగె। శబరి దరియింపజేసె
సంసారజలధి బవనసుతుని నిగరణించెబద్ధబాంధవ। వాత్మజునకిం
పుత్రో భయంబొసంగె ।ఉ॥ రావణ హృద్భయంకర పరాక్ర

మసంయుతుఁడై చెలఁగు సుగ్రీవ కపీశ్వరాగ్రజుని గిటుఁగిం
చె విరోధితమ్మునిన్। శ్రీవెలయం బరిగ్రహము జేసి నిజాఖిల
నాయకత్వ మున్ వనలయంబునందు రఘువీరుఁడు తెల్లము చేసె
నెమ్మిఁదిన్ ॥గీ॥ రాముఁడు విబుధప్రసన్న సంరక్షకుండు। వికులా
నీకపర్వతకల్పాంభోరు। నేను నీమంతి తాంతకాశాతటంగిణీ మ
నోవల్లభుండు సుత్రామ నుతుండు ॥సీ॥ లంకాపురక్షిత పంకజ
లోచనా కంపనాత్యుగ్రయూ కారణుండు। శాతశరాసార చకి
తదశాసన పకటిత బాహావిక్రమ బలుండు। కుంభకర్ణాది
దక్షోహిర పర్వతాద్భుత బలదళన దంభోళిధరుడు। శక్రజిద్భీ
కర సంగ్రామతత్పర సౌమిత్రి రక్షణోత్సాహ పరుఁడు। లోకభీ
కర దశముఖానేకంఠ। ఖండనోదిత రాక్షసకామినీ విలాపని
నదప్రమోదితా శాపతీంద్రు। జంబవదనా సమూహ మనోం
బుజాంశు ॥ ఉ ॥ ఆరఘురాముఁడింపున దశాస్యనిభారము
భూపురంధ్రికిన్। దూరము చేసి ధర్మవిరతుండగు పజ్ఞ్రము
ఖానుజన్మునిం గారవకస్వమొప్ప దశకంఠుని రాజ్యమునందు
నిల్పి కాంబేరరథంబు మీద దనప్రేయసితో వసియించె వేడు
కన్ ॥మ॥ జలజాప్తాత్మజ ముఖ్యులెల్లఁ గొలువన్ సౌమిత్రి సే
వింప భ్రాతులతో మానసవీధులన్ భరత శత్రుఘ్నుల్ ము
దంబంద నిర్దగ్ధతారాతి నహానుతాపరుఁడయోధ్యన్ గాపు
రంబున్న వారలకన్ లోచనపర్వదుండౌచు జేరంబోయె సాకే
తమున్ ॥క॥ భరితప్రాభీతుండై దాశరథి వసిష్ఠాది మునులు
సంతోషింపన్। సురలునుతింపనయోధ్యాపురమేలెన్ ధర్మ
మార్గమున సానుజుఁడై ॥శా॥ సీతాసంయుతుఁడై సమస్త
నృపతుల్ సేవింప నానాజనుల్। ప్రీతింజెంద ననేకవత్సరము

ఉర్వి నేలఁ బాలించి సాకేత స్థావర జంగమంబులను ము
క్తిం జెందఁ గాఁ జేసి లోకాతీతుండు రఘూద్వహుం డగుచు వి
శ్వాధీశుఁ డాఁ బ్రబమే ॥క॥ అట్టి దేహవల్లభుఁ జే విశ్వంబెల్ల సే
వ పింజఁ దింపం దేవసనాధీశ తమై భావింపఁ బడును దత్స
బలసహితులకున్ ॥వ॥ అని వివేకుండు ముదంబున నిట్లనియె॥

॥శా॥ పారావార పయోవిశోషణ కళాపారీణ కాలానలో
దారస్ఫూర్జిత శిఖా భయంకర శరాధారాంకిత సూనాయుధా
కారుం డాశ్రిత రక్షకుండ సుకవిశ్లాఘాపాతుకీ ధుర్యుఁడా శ్రీ
రామాఖ్యుఁడు మా మనోఘ లతలం ఛేదించు నెల్లప్పుడున్॥

గీ॥ ధర్మ విగ్రహుఁ డైనట్టి దాశరథి య ధర్మ పద్ధతి ము
ద్ధ్వంధి ధరణిలోన జేరనీఁ డగఁ జేసి రక్షింపఁ గలయుననిన బలి
తోడ సుమతి యిట్లనియె బ్రీతి ॥గీ॥ సేతుసంస్థాపనముఁ జేసి చె
లఁగు రామచంద్రుని తెరంగునను శివు జనులు పొగడ ధర్మ సం
స్థాపనముఁ జేసి తనరుమరిన వరమతితో వ్యవసాయుఁ డిట్లనియె
బ్రీతి ॥క॥ చూడుము వివేకపుష్టిని నాఁ డేనందాదు లెల్ల నారా
యణుఁడీ ప్రోడయని నిశ్చయించిరి వాఁడిమగంటిమిఁ గట్టి వ
సుదేవసుతుఁడు ॥క॥ ఈ వసుదేవకుమారుఁడు కేవల మనుజుండు
గాఁడు గీతోప నిషద్ద్యావాచార్యుఁడు మునిజనసేవిత పాదా
బ్జుఁ డైన శ్రీధవుఁడు సుమీ ॥ఉ॥ ఘోర సశాట భార మిల కం
దొలగించె వసించె గంధునా ఖీర సరోజలోచనల బ్రీతిసరించె
జయించె భూసుతుం దోరముగా మహిం గురుసుతున్ బ్రతి
ంచె గిరీటి కాజిలో సారథియయ్యె యాదవుల సయ్యన నేలె
నితం డుదారుఁడై ॥వ॥ పూతనా శకటాసుర యమళార్జున కే
శి ప్రలంబ ధేనుకాసుర కాళియ కువలయాపీడ చాణూర

ముష్టికాది దుష్టదనుజ మర్దనుండగు గోపాల దేవుండాశ్రిత
సంరక్షణార్థంబు గోవర్ధనాచలంబు గరాగ్రంబునెత్తెనని
న వ్యవసాయుం గనుంగొని సుశ్లోకుండగు వివేకుండిట్లనిను
వేదశిఖామృగ్యమాణ చరిత్రుండును యమళార్జున సంభ
గ్నిత బాలక్రీడా విలాసుండును । యమునాతీర చరదాభీర భా
మినీ సమాక్రాంత యౌవన ధనుండునునగు నందనందను
ను నమస్కరించి యతని పాద పల్లవంబులు హృదయాబ్జంబు
న నిలిపెదననిన వ్యవసాయుండిట్లనియె । సురుచిరాభీరవధూ
సంగీతరవంబును గోపాలబాలహస్త తాళనినాదంబును । న
టదర్భక వేషధర పూతనాసంహారిక చరణనూపురసింజితా
మ్రేడిత వంశనాళ నినదంబును । కర్ణరసాయనంబు గాపిం
చుచున్నవియని మరియునిట్లనియె (చ) కరినగరీ నివాసమున
తి కారణముల్ ప్రబలప్రలంబ సంహరణ సమర్థ పటుల్ సు
రనుతాతిశయంబులు గోపికామనోహరములు నందనందన స
మగ్రచరిత్ర సఖంబులై మహింబరగు హరిప్రభావములు భం
గశుభంబు లొసంగు గావుత (క) అనిన వివేకునితో నిట్లనె
సుమతి ధరిత్రి భారమణచిన యదువీరునిగతి సంసార భరంబు
న ఘా నీవణగ జేయుమను చుర్వ ప్రీతిన్ (క) అతరువాత వివేకు
డు । శ్రీతింగలికి స్వరూపుబీతాంబరులో । కాతీతుర హరిగననా
ని । చేతోగతినిట్లు వినుతి జేసె వినతుడై (సీ) విష్ణుయశోనా
మ విప్రునికుదయించి కలికధా కాలుష్యములనడంచి । సక
లదుర్మార్గుల సంహారమొనరించి భూభారమెల్లను బోలియ
జేసి । తర్కింపగా భావి దశమావతారమై కలికినామంబున జె
లగునితడు । పాణిపద్మాంచత్కృపాణ ధారాధర ధారాజలం

